లైబ్రరీ ఎడిషన్ రు 1-4-0

పాపులర్ ఎడిషన్ రు 0-12-0







: ముద్రణ :

పాప్యులర్ పవర్ ప్రింటింగ్ ప్రెస్,

సూర్యారావుపేట,

కాకినాడ.

# దత్తపుత్ర శోకము



మల్లెమాల సూర్యనారాయణరావు



పాప్యులర్ పబ్లిషర్సు,
కాకినాడ.

వెల రూ. 0-12-0

# విజ్ఞప్తి.

రచయిత నేటి సామాజికపరిస్థితులను, రాజకీయ పార్టీల వైఖరిని బాగుగా గ్రహించి, వాస్తవిక విషయాలను చక్కగా చిత్రించేరు. ద్వేషానికి, దూషణలకు పుస్తకములో ఎక్కడా తావుయివ్వలేదు. శాంతియుత మార్గాల ద్వారానే, విప్లవకర మార్పులు సాధించుట వీలగునని ఋజువుచేసారు.

భారతీయ మహాపురుషుల బోధనలను అవగాహన చేసుకొని, వాటిని నాటకంలోని పాత్రలద్వారా వెల్లడించుటే గాకుండ, కొందరు మహనీయుల ప్రవచనాలను రంగముల చివర యిచ్చుట ద్వారా పుస్తకానికి మరింత శోభ కల్పించ బడింది.

నూతన పద్ధతులలో వ్రాయబడిన యీనాటిక అన్నితరగతుల ప్రజలను సంతృప్తి పర్చగలదు. ఏతరగతిని నొప్పించకుండ మంచి మార్పులు తేగలదు.

నేటి అంతర్జాతీయ పరిస్థితులలో భారతదేశం చారిత్రాత్మక పాత్రవహించ వలసివుంది. అది సక్రమంగా నెరవేరాలంటే భారతీయులు మన అపూర్వ జ్ఞాన సంపదను స్వీకరించి, దాని ప్రకారం అభ్యుదయ మార్గాన ముందుకు సాగుట అత్యావసరం. అందుకై యిట్టి ఉత్తమ రచనలు ఎంతేని తోడ్పడ గలవు.

కాకినాడ, 5 ఆగష్టు 1956. } కె. వి. వి. సత్యనారాయణమూర్తి బి. ఎ., పబ్లిషర్.

# అంకితం.

జమీందారీ కుటుంబములో జన్మించి జాతీయ ఉద్యమం లోను, పీడితప్రజల ఉద్యమంలోను, తన కుటుంబముతో సహా పాల్గొని, ఆస్తి నిత్యాగంచేసి, రహస్యపురోజుల్లో ఆఖరికి అన్నానికి కరువై, రోగాలకు గురియై అశువులు బాసిన అజ్ఞాత వీరుడు డాక్టర్. మండవిల్లి వెంకటవీరయ్యగారికి—

# పాత్రలు.

| | | | |
|---|---|---|---|
| చాచాజీ | సర్వోదయవాది | సూరయ్య | కౌలు రైతు. |
| శ్యామసుందర్ | భూదాన్ ఉద్యమములో పనిచేసే మరొక అభ్యుదయవాది | సింహాచలం | లక్ష్మీపతిఇంటి పనిమనిషి. |
| కోటేశ్వర్రావు | దత్తపుత్రుడు | కాంగ్రెసు నాయకుడు | |
| రమణ | కోటేశ్వర్రావు భార్య | కమ్యూనిస్టుపార్టీ పెద్ద | |
| మహాలక్ష్మమ్మ | కోటేశ్వర్రావు దత్తతతల్లి | సుభద్ర బిడ్డ | |
| లక్ష్మీపతి | రమణ తండ్రి | డ్రైవరు | |
| కనకమ్మ | రమణ తల్లి | | |
| వెంకటేశ్వర్లు | లక్ష్మీపురంలో లిటిగెంటు | రైతులు | |
| గోపాలం | లక్ష్మీపురంలో యదార్థవాది | పేటపెద్దలు | |
| స్వామి | మహాలక్ష్మమ్మగారి ఉద్ధారుడు | ప్రచారకదళ సభ్యులు | |
| దాసు | మహాలక్ష్మమ్మగారి యింటినౌఖరు | | |
| సుభద్ర | శ్యామసుందర్ చెల్లెలు | | |
| డాక్టర్ విశ్వేశ్వర్లు | రాజవాడలో డాక్టరు-వెంకటేశ్వర్లు తమ్ముడు | | |
| వ్యాఘ్రేశ్వర్రావు | రాజవాడలో వ్యాపారి, కంట్రాక్టరు | | |
| రోజా | కోటేశ్వర్రావు ఉంపుడుకత్తె | | |
| రంగడు | రోజాయింటివద్ద వుండేకుర్రవాడు | | |

---

# దత్తపుత్రశోకము

౧వ రంగం.

[స్థలం. మహాలక్ష్మమ్మగారి భవంతి వెనుక వసారా—సమయం ఉదయం 8 గంటలు—మహాలక్ష్మమ్మ సుమారు ఏబది ఏళ్ల వితంతువు. జబ్బుతో మంచముమీద వుంటుంది—గ్రామలిటిగెంటు వెంకటేశ్వర్లు మంచానికి కొంత దూరంగా స్థంభానికి జేరబడి తుంగ చాపమీద కూర్చుని ఉంటాడు—నలభై సంవత్సరాలనుండీ ఆ యింటి నౌఖరీ చేస్తున్న దాసు ఆ సమీపంలో నిలబడి ఉంటాడు.]

మహాలక్ష్మమ్మ : వెంకటేశ్వర్లు బాబూ! ఆరోగ్యం లేని బ్రతుకు బాధలు అనుభవించుటకే గదా.. ఆరోగ్యం లేనప్పుడు ఇక ఏమివుంటే ఏమి ప్రయోజనం?

దాసు : ఆరోగ్యం, ఐశ్వర్యం సవతులమ్మా...

మహా : బాబూ! బాగుపడి కాలు క్రిందపెట్టే యోగం ఇక నాకు లేదుకాబోలు.

వెంకటేశ్వర్లు : అవిశ్వాసం అనర్ధానికి దారి తీస్తుంది. మీ రలా నిరాశ చెందడం మంచిదికాదు. నిన్న మా తమ్ముడు 'ట్రంక్‌ఫోన్'లో బొంబాయిలోని 'స్పెషలిస్టు'తో మాట్లాడేడట. ఆయన మిమ్మల్ని తీసుకురమ్మన్నాడట.

దాసు : విశాఖపట్టణం, మద్రాసు, హైదరాబాద్ లలోని హేమా హేమీలంతా అయిపోయేరు. వారివల్ల ఏమీ కాలేదు. ఇక బొంబాయి డాక్టరు ఉద్ధరిస్తాడా ?

మహ : దాసూ ! నేను పడుతున్న బాధ నీకు తెలియడంలేదు.

దాసు : 24 గంటలూ ఇక్కడే ఉంటున్న నాకు తెలియనిదేముందమ్మా...చేసుకున్నదాని ఫలితం అనుభవిస్తున్నారు. తప్పించటం ఎవరితరం. ఇప్పటికైనా అనవసర ప్రయత్నాలు మాని, రామనామ జపం చేసుకోండి. అదే మీకు దివ్యౌషధం.

(స్వామి, సూరయ్య ప్రవేశిస్తారు.)

మహ : ఏం సూరయ్యా ! అప్పు పెట్టి భూమి కౌలు కిచ్చి పగవాళ్ళమైపోయామా ? మూడు నాలుగు కబుర్లుపంపినా రావడమే మానేసేవేం ?

స్వామి : డబ్బు పాపకారి అమ్మా... అంతవరకూ యిష్టులుగా ఉన్నవాళ్లు కూడా, డబ్బుగొడవ వచ్చేసరికి విరోధులవుతారు.

సూరయ్య : ఏమండీ... అలా నిష్ఠూరంగా మాట్లాడుతారు ? రెండు వందలు ఖరీదు కట్టుకొని పోతుల జత తోలుకున్నారు. నాలుగున్నర బస్తాలు నువ్వులిచ్చేను. ఇంకా ఏమివస్తుందమ్మా మీకు...

స్వామి : కాగితాలు అబద్ధమాడవుగదా...

సూరయ్య : అయితే నేను అబద్ధమాడుతున్నానా ?

మహా : రమణా !... రమణా !

(రమణ ప్రవేశం—వయస్సు ఇరవై ఏళ్లు. ఒంటినిండా నగలు, ముఖంలో విచారం వ్యక్తమవుతుంది.)

రమణ : ఏం అత్తయ్యా !

మహా : ఆ ప్రోనోట్లకట్ట తెచ్చి వెంకటేశ్వర్లుగారికియ్యి...

(రమణ ప్రోనోట్లకట్ట తెచ్చి యిస్తుంది. వెంకటేశ్వర్లు వెతికి సూరయ్య నోటుతీసి చూస్తాడు.)

వెంక : మార్చి నెలలో ఆఖరుజమ నూట యిరవై వుంది.

సూరయ్య : అది అప్పుడిచ్చిన రొఖ్ఖం. దర్మిలానే పోతులు, నువ్వూలూను. ఆ రెండు బాపతులు జమకట్టలేదా ?

వెంక : చేబదుళ్ళు ఏమైనా పట్టుకువెడితే వాటిక్రిందగాని అవి చూచుకున్నారేమో...

సూరయ్య : వేలుముద్ర వేయించుకోనిదే ఎన్నడూ ఏగానికూడా యివ్వలేదు.

మహా : నువ్వెలెప్పుడిచ్చేవు ?

సూరయ్య : కోటేశ్వర్రావుగారు నాలుగుబస్తాలు రాజవాడ పట్టించుకువెళ్ళేరు. మీ ఖర్చుకు కావాలని స్వామి అరబస్తా తెచ్చేడు.

మహా : స్వామి ఎప్పుడు తెచ్చేడు ?

స్వామి: తెచ్చినట్లు గుర్తులేదండి. నాకు ఎప్పుడిచ్చేవు సూరయ్యా?

సూరయ్య: పట్టుకు వెళ్ళినప్పుడు వున్న వాళ్ళచే సాక్ష్యం యిప్పించమంటావా ?

స్వామి: సాక్ష్యాలుదాకా ఎందుకులే. ఇచ్చినట్లు నాకు జ్ఞాపకం లేదు.

మహా: బాగానేవుంది, నాలుగుబస్తాలు అతనికెందుకిచ్చేవు ?

సూరయ్య: ఆయన మీ కుమారుడేగా...

మహా: సరేగాని...... ఇక మా చేలో మంద మళాగత్తులు చెయ్యాకు. ఈ ఏటినుంచి మేమే స్వంతంగా చేయించుకుంటాము. బకాయి ఏమీ వుంచక త్వరగా తీసుకురా.

సూరయ్య: ఏ ఏడాదికా ఏడాది మగతా వువ్వాల్లో పెట్టినట్లు తెచ్చి యిస్తున్నాం. శిస్తు రేటు కూడా ఏమీ తక్కువ గాదు. ఇక మీకువచ్చిన నష్టం ఏమిటి అమ్మా...

మహా: ఆ గొడవంతా ఎందుకు ? చేను మాదా... మీదా ?

సూరయ్య: మీదనేగదా అమ్మా... శిస్తు తెచ్చి యిస్తూవుంది. అయినా ఆ భూదేవినే నమ్ముకుని ముప్పయి ఏళ్లనుంచి చేస్తున్నవాళ్లని లేచి పొమ్మనడం మీకు ధర్మంగాఉందా?

మహా: మా భూమి మేము చేయించుకుంటామంటే అందులో అధర్మమేముంది ?

సూరయ్య : ఈ కౌలు కొండ్రతప్పితే, వేరే స్వంతజిరాయితీలు ఏమీ లేనివాళ్లము. పైగా కూలికిపోకుండా ఇంటిల్లిపాది, అందు లోపడి చేసుకు బ్రతుకుతున్నాం. కాస్త దయతో ఆలోచించండి తల్లీ... (సూరయ్య విచారంతో వెడతాడు.)

స్వామి : కౌలుకుచేస్తున్న భూములన్నీ వీళ్ల బాబుగారిమాన్యాలుగా చేసేసుకుందామనుకుంటున్నారు.

మహా : సరేగాని, నీవు వెళ్ళి రాయుడు రామన్నని దగ్గర వుండి తీసుకురా. నాలుగైదు రోజుల్లో వాడినోటు కాలదోషం పడుతుంది. మాయముండాకొడుకు ఎన్ని కబుర్లు పంపినా రాకుండా ఉన్నాడు.

వెంక : మొన్న నేనూచెప్పేనమ్మా... అతని ధోరణి ఏమీ యిచ్చేటట్లు కనిపించదు.

మహ : అయితే దావా దాఖలు చేయించండి......

(స్వామితో) అయినా నీవు వెళ్ళి చూచిరావోయ్.

(స్వామి వెడతాడు.)

బాబూ! మక్తాలు వసూలయినతరువాత బొంబాయి వెళ్లే విషయం ఆలోచిద్దాం. మీరు వెళ్ళిరండి.

(వెంకటేశ్వర్లు వెడతాడు—రమణ పోస్టునోట్లకట్ట లోనికి తీసుకు వెడుతుంది.)

దాసు. మజ్జిగ గంపల సుబ్బమ్మ ప్రొద్దున్నేవచ్చి పెరుగుముంతలు తీసుకువెళ్ళిందమ్మా.

మహా : గతవారం బాకీ, ఈవారం డబ్బు అడగలేదా ?

దాసు : అడిగేనమ్మా. పాడుకలవాళ్ళకు జీతాలు ఒకటో తారీఖున అందుతాయట. అందుకని రెండు, మూడు తేదీల్లో తెచ్చి యిస్తానంది.

మహా : ఇంట్లో ఒకడబ్బా నెయ్యుండింది. రేపు వచ్చినప్పుడు ఎవరికైనా కావాలేమో చెప్పమను.

(వీధిలోనుండి పిడకలు—పిడకలు అని పిలుపు.)

దాసు : అమ్మా ! పిడకలబండివాళ్లొచ్చేరు.

మహా : జాగ్రత్తగా దగ్గరవుండి లెక్కపెట్టించు. సరిగా లెక్కకట్టి డబ్బు తీసుకో. అరువేమీ పెట్టనివ్వాకు.

(దాసు వెడతాడు.)

రమణా ! నోరు ఎండిపోతుంది కాస్త మజ్జిగతేట, గంజి కలిపి తెచ్చిపెట్టు అమ్మా !

రమణ : (దగ్గరగా వచ్చి) ద్రాక్షపళ్లు గాని, దానిమ్మగింజలు గాని, యివ్వమంటారా అత్తయ్యా !

మహా : అస్తమానూ అవిఎందుకమ్మా... అవి బోలెడుఖరీదు.

(రమణ లోనికివెళ్ళి మజ్జిగ తేట, గంజి కలిపి తెచ్చియిస్తుంది.)

మహా : (తాగుతూ) అమ్మా ! బాబువచ్చేడా ?

రమణ . రాలేదు అత్తయ్యా !

మహా: (తన చేతిలోని గ్లాసును రమణకు యివ్వబోతూ, రమణ చేతిని తన రెండు చేతులతోను పట్టుకొని) అమ్మాయ్! ఎంతో సుఖపడతారనుకుంటే నీ బ్రతుకు ఇలా అయిపోయింది. చిలకా గోరింకల్లా ఉండవలసిన యీవయస్సులో ఇలాంటి పాడు బుద్ధులు వాడికి పుట్టడం... మన దురదృష్టమే..... ఆ రాజిముండ వాడికేదో మందు పెట్టేవుంటుంది.

(రమణ మాట్లాడక అత్త ముఖంలోకి చూస్తుంది. విచారం, బాధ ఆమెముఖంలో ప్రస్ఫుటమౌతుంటాయి.)

(తెర.)

---

"తన సుఖమే సుఖం, తన దుఃఖమే దుఃఖం అని తలపోయడం కేవలం పశులక్షణం, ఇతరుల సుఖ దుఃఖాల్లో భాగం పంచుకొని జీవించడం, సామాన్య మానవ లక్షణం. ఈ సుఖ దుఃఖాలు రెంటినీ తుచ్ఛవస్తువులుగా భావించి శారీరిక మనోబుద్ధీంద్రియాలకు అతీతుడై జీవించడం మహా పురుష లక్షణం." —బాబా.

# దత్తపుత్రశోకము

## ౨ వ రంగం.

[రోజా కాపురమున్న మేడ—హాలులో సోఫాసెట్— 'టీపాయ్'పై బ్రాందిసీసా, గ్లాసులు, సిగరెట్ టిన్, దానిపై అగ్గిపెట్టి ఉంటాయి. కోటేశ్వర్రావు, రోజా సోఫాకు చెరొక చివర కూర్చుని ఉంటారు— రంగడు వీధిలోకి హాలులోకి తిరుగుతుంటాడు.]

రోజా : మనస్సు ఎక్కడవుంటే అక్కడికే వెళ్లక, అయినవాళ్ల దగ్గరకు, కానివాళ్లదగ్గరకు తిరిగి, నా వళ్ళు నాశనం చెయ్యడం ఎందుకు ?

కోటేశ్వర్రావు : నేను తిరిగితే నీవంటి కేమొచ్చింది ?

రంగడు : మీ ఆర్జనలో మా అక్కకుకూడా భాగముంటుందిగా.

రోజా : మోజుఉన్న చోటే ఉండిపోక నన్నెందుకిలా ఏడ్పించటం? దీనివల్ల మీరు మాత్రము ఏమి సుఖం పొందగలుగు తారు ?

కోటే : నీతులు నేర్పుతున్నావా ఏమిటి ?

రంగ : నేర్పడం బావగారి బాధ్యత...... నేర్చుకోవటం మా అక్క విధి.

రోజా: నేర్పి తీసుకొచ్చింది మీరు, అలవాట్లన్నీ మప్పింది మీరు, ఇక మీకు నేను నేర్పేదేముంది ?

కోటే: చాలు... నోరుముయ్.

రోజా: ఇంతకాలం మూసుకునే ఉన్నాను. అందుకే నా బ్రతుకు యిలా అయిపోయింది.

కోటే: ఇప్పుడు నీకొచ్చిన లోటేమిటి ?

రోజా: రోగాలకు దుర్వ్యసనాలకు లోటులేదు. ఆహా, పోరుకు అసలే లోటులేదు. సుఖానికి తప్ప...

కోటే: అసలు విషయం ఏమిటో ఏడవక, ఈ సనగటమంతా దేనికి ?

రంగ: అలా దారిలోకి రండి.

రోజా: నాతిప్పలు ఇప్పుడేమున్నాయి. ముందున్నది ముసుళ్ళ పండుగ.

కోటే: ఈ పాఠాలన్నీ ఎక్కడ నేర్చుకుంటున్నావు ?

రంగ: మీకన్న గురువులు ఎవరున్నారు... పాఠాలు నేర్పడమే గాకుండ 'ప్రాక్టీస్' యిచ్చే ప్రభువులుకూడా మీరే...

రోజా: నిండా రెండేళ్ళుకూడా కాలేదు. నా వళ్ళు నాకే బరువయ్యే పరిస్థితికొచ్చింది. ఇక నాభవిష్యత్ ఏమిటో?

కోటే: నీఒంటికేమి ? లావెక్కడమేనా ?

రంగ: అక్కా! నీవు లావెక్కితేనేం... సన్నంగా వుంటేనేం. బావగారి కంటికి బాగా ఆనాలిగాని.

కోటే: అన్నిఖర్చులు పెట్టి, అయిదువందలు నెలకిస్తుంటే సంతృప్తి లేదా ?

రోజా: నేనొక అద్దెదాన్ని. నా బ్రతుకే అద్దెబ్రతుకు. నేనున్నది అద్దెకొంప. అలాంటప్పుడు నాకెందుకు సంతృప్తివుండదు ?

రంగ: ఇప్పుడిద్దరికీ సంతృప్తిలేదు... పాపాయి పుడితే ఇద్దర్నీ కట్టిపారేసును.

రోజా: అంత అదృష్టమా !

కోటే: పునాదులు లేచేయి. సామాను సిద్ధంగావుంది. ఎటొచ్చీ నిలబెట్టడం తరవాయి.

రోజా. కట్టాలి. సాప్రపని చెయ్యాలి. అందులోకి సామాను కావాలి. అయితేమాత్రం కాపురండుండే కొంపే కూడెడు తుందా ఏమిటి ?

కోటే: పండూరు పల్లపుభూమి పదిహేను ఎకరాలు దస్తావేజు వ్రాయడం అయింది. ఇక ఎటొచ్చి రిజిస్ట్రేషనేగా తరువాయి.

(వ్యాఘ్రేశ్వర్రావు ప్రవేశిస్తాడు — కట్టింది ఖద్దరయినా, డ్రెస్ 'టిప్‌టాప్' గా వుంటుంది—కోటేశ్వరావుకు సమీపంగావున్న కుర్చీలో కూర్చుంటాడు.)

కోటే: (వ్యాఘ్రేశ్వర్రావు నుద్దేశించి) మా రోజాకు అహర్నిశలు ఆస్తికై ఆరాటం ఎక్కువై పోయిందండి.

వ్యాఘ్రేశ్వర్రావు: ఏమిటోనండి. వ్రాతలతో సహా అన్నీ అయ్యే పోయేయి. ఇక ఎటొచ్చి రిజిస్ట్రేషనేగా తరువాయి.

రోజా: ఈ తరువాయిలకే 'గోడమీద రేపు' అవుతోంది. ఏనాటికి ఏది ఎలా మారుతుందో ఏం చెప్పగలం......

రంగ: "ఆలస్యం అమృతం విషం"అని పెద్దలు ఊరికేఅన్నారా?

వ్యా: ఏం భయంలేదు. కోటేశ్వర్రావుగారు అలాంటి మనిషి కాదు.

రంగ: మీరు ఏఆటకా ముద్దెల క్కొట్టగల సమర్థులు.

(రోజా లోనికి వెడుతుంది)

కోటే: మీరు నిన్న సాయంకాలం వస్తానని రాలేదేమి?

వ్యా: 'క్లబ్'కు వెళ్ళేను. మనవాళ్ళంతా సినీమా తార మిస్ అమృతాన్ని మన పట్టణానికి ఆహ్వానించాలని నిశ్చయించేరు. ఆ సందర్భంలో ఆహ్వానసంఘాధ్యక్షులుగా మీరే వుండాలని ఏకగ్రీవాభిప్రాయం.

కోటే: నేనెందుకండి? ఆవేళ నాకు తీరిక ఉంటుందో, ఉండదో?

వ్యా: మీరే అన్నివిధాల అర్హులని అందరి ఉద్దేశం. మీకు ఎప్పుడు వీలైతే అప్పుడే ఏర్పాటుచెయ్యవచ్చు.

రంగ: చేతిచమురు భాగోతానికి సిద్ధపడితే చాలావాటికి అర్హులవుతారు.

కోటే: మీరంతా అట్లా పట్టుపడితే కాదనడం కష్టం... తేదీ దగ్గరలోనే ఏర్పాటుచెయ్యండి. ఆలస్యం ఎందుకు?

వ్యా: మనవాళ్ళ ఉద్దేశంకూడా తొందరగా పెట్టాలనే. అయితే యీవేళే 'ఫోన్' లో కాంటాక్టుచేసి 'డేట్ ఫిక్సు'చేస్తా.

గో: ఆ సందర్భంలో 'డిన్నర్ పార్టీ' ఏర్పాటు చెయ్యడం బాగుంటుందేమో?

వ్యా: చాలా బాగుంటుంది. ఎక్కువ మందిలో ఆ అభిప్రాయం వుందికూడా. కాని మీరు ఏమనుకుంటారోఅని చెప్పలేదు

సంగ: అసలు ఆడవాళ్ళమీదనుంచివచ్చే సీసాలు ముందు 'ఓపెన్' చేస్తేగాని 'డిన్నర్' మజాగా ఉండేవుండదు.

గో: అబ్బే! అదేమిటి? ఆవేళ 'ఫస్టుక్లాస్ డిన్నరు' తప్పక ఉండాల్సిందే.

వ్యా: ఈమధ్య మావాళ్ళు భూమిబేరం కుదుర్చుకొని, బజానా యిచ్చి అగ్రిమెంటు వ్రాయించుకున్నారు. దానివాయిదా దగ్గరకొస్తోంది. అందుకని ఆ బాకీలగురించి, మరీ తొందరచేస్తున్నారు.

గో: వారం, పదిరోజులలో సర్దుబాటు చేద్దాం.

వ్యా: ఇదివరలోలా రకం తిరుగుతుంటే, నేనే సర్దుబాటు చేసేవాణ్ణి. కంట్రోల్సు ఎత్తివేసిన దగ్గరనుండి, వ్యాపారం పూర్వంలా కిట్టింపులేదు. చేతిలో డబ్బులేకే, పెద్దశిఫార్సు వుండికూడా, మంచి కిట్టింపువుండే కంట్రాక్టుకు టెండరు పెట్టి ఊరుకోవలసివచ్చింది.

గో: దాని 'క్లైమ్' అయిపోయిందా, ఇంకాఉందా? ఏమిటా కంట్రాక్టు?

వ్యా: గవర్నమెంటు బిల్డింగులకు 'టేక్‌వుడ్' సప్లయి చెయ్యడం బాగా కిటుతుంది. లెండి—ఇక వాయిదా వారం రోజులే వుంది.

కోటే: అయితే పోనివ్వకండి, ఏదోవిధంగా చూద్దాం.

(రోజా ప్రవేశం—బ్రాండీసీసా మూత తీసి గ్లాసుల్లో పోస్తుంది.)

(తెర.)

---

"సమాజంలో ఆర్థిక అసమానత్వం, వ్యక్తిస్వార్థంతో కూడిన పోటీ ప్రాధాన్యత వహించి ఉన్నంతకాలం — భూమి, నీరుపై ప్రజలందరికి సమిష్టి హక్కు ఏర్పడనంతకాలం మానవులు, కనీసం ఆర్థిక విషయాలకు సంబంధించినంతవరకైనా క్రూర మృగాలకన్న అతిహీనంగా ప్రవర్తించడం జరుగుతుంది".

—సుబ్రహ్మణ్యభారతి.

# దత్తపుత్ర శోకము

## 3వ రంగం.

[లక్ష్మీపతిగారి గృహం—తలంటి నీళ్లుపోసుకున్న రమణకు తల్లి కనకమ్మ సాంబ్రాణి పొగ వేస్తూ, జుట్టు ఆరవిప్పుతూ ఉంటుంది—గోపాలం ప్రవేశం]

గోపాలం: కనకమ్మ పిన్నీ! ఎల్లుండి సాయంకాలం మనవీధిలో మీటింగు జరుగుతుంది. పొరుగూళ్ళనుంచి వచ్చే పది మందికి భోజనాలు పెట్టాలి.

కనకమ్మ. దానికేమి... అల్లాగే పెడదాం నాయనా!

రమణ: ఏం మీటింగు అన్నయ్యా?

గోపాలం: భూదాన ఉద్యమానికి సంబంధించింది.

రమణ: ఈవూళ్లో భూదానంచేసే బుద్ధిమంతులెక్కడున్నారు? పిల్లలు ఆడుకోడానికి, నలుగురు సాయంకాలం కూర్చో డానికి వీలుగా వుండే చిన్న 'పార్కు' ఏర్పాటు చెయ్య లేకపోయేరు...

గోపాలం: వూళ్లోభూములు చాలక, చుట్టుప్రక్కల గ్రామాల తాలూకు భూములు కూడా చాలావరకు కొనేసేరు. అయినా తృప్తిలేక పుంతలు, పోరంబోకులు, స్మశానము ఆక్రమించుకున్నారు.

రమణ: ఆశకు అంతు వుంటేకదూ!

గోపాలం: ఓ వైపున భూమికి సంబంధించిన శాసనాలు రాబో తున్నాయని గాబరాపడిపోతున్నారు. మరోవైపున ఏ బిక్కవాడైనా, ఎవరికి ఉపయోగించని ఏపోరంబోకయినా దున్నుకుంటే కాకిగోల పెడుతున్నారు.

రమణ: దురాశే, దుర్బుద్ధి కలిసేవుంటాయి.

(దాసు ప్రవేశం)

దాసు: రేపు శ్రావణశుద్ధ శుక్రవారం. రమణమ్మగారిచే వర లక్ష్మి వ్రతం చేయించాలని, మహాలక్ష్మమ్మగారు చెప్ప మన్నారమ్మా!

రమణ: చేసిన నోములు వ్రతాలు చాలవా?

కన: పెద్దవాళ్ళమాట త్రోసివెయ్యడం తప్పుకాదా?

రమణ: ఎవరమ్మా పెద్దలు? నాజీవితాన్ని యీస్థితికి తెచ్చిన వాళ్ళేనా?

గోపాలం: మాటవరసకి వయస్సు ముదిరినవాళ్ళని పెద్దలంటారే గాని, అసలు పెద్దవాళ్ళు అంటే డబ్బు మురగబెట్టినవా ళ్ళన్నమాట... నేను వెడతానమ్మా.

(గోపాలం వెడతాడు)

రమణ: పాపం! పెద్దవాళ్ళనే కాబోలు ఆడపడుచుల మాట కాదనలేక కూతుర్నిచ్చేరు.

దాసు : చిట్టితల్లీ ! అసలువిషయం ఆస్తి, ఆస్తికోరకే దత్తత, ఆస్తికోరకే పెళ్ళి, ఆస్తికోరకే అన్నీ.

కన : అవును. ఆ ఆస్తి, యీ ఆస్తి పైకిపోకుండా వుంటుందని మీ మేనత్తలు పట్టుబడితే, మీ నాన్న అడ్డు చెప్పక అంగీకరించేరు.

రమణ : ఇందులో ఏఒక్క ఆస్తితోనైనా, ఏభయ్యేసి కుటుంబాలు దర్జాగా బ్రతకవచ్చే. అయినా యింకా ఆశ ఎందుకమ్మా !

దాసు : అమ్మా ! మీరు అనేది పొట్టకై పాటుపడేవాళ్ళ విషయంలో... పెట్టెలు నింపుకోడానికి తాపత్రయపడేవారికి ఆ మాటలు రుచించవు.

రమణ : ఇంటిమేనల్లుడు విద్యాబుద్ధులు, గుణగణాలు ఎరుగరా అమ్మా !

కన : ఎరుగకేమి... పెద్దవాడయితే అవే పోతాయనుకున్నామే గాని, ఇలా ఆ రోజు కారోజు మితిమీరి పోతా యనుకున్నామా...

రమణ : మొక్కై వంగకపోతే, మానై ఒంగుతుందా ?

దాసు : ఆశ అనే చీకట్లో అవేవీ కనిపించవు తల్లీ,

కన : అయిందేదో అయిపోయింది. ఇక యిప్పుడు చెయ్యాగలిగింది ఏముంది ? రేపు వ్రతంమాట ఏమిటమ్మా ?

రమణ : పెద్దపెద్ద సిద్ధాంతులచే ముహూర్తం పెట్టించేరు. వేద పఠనాలతో, ఆశీర్వచనాలతో అక్షతలు వేసేరు. ఏను గుపై ఎక్కించి మంగళ వాయిద్యాలతో ఆడంబరం, అట్టహాసం ఉట్టిపడేలా ఊరేగించేరు. క్రియకు వచ్చిన ఫలితం ఏమిటి ? ఆ మంత్రాలకుగాని! ఆ ఆశీ ర్వచనాలకుగాని మమ్మల్ని ఒకటిచేసేశక్తి లేకపోయిందే...

కన : అయ్యో... వెర్రితల్లీ.. ఎప్పటికె ఏ దేవునికి ఏందయ కలుగుతుందో మన పని మనంచెయ్యావద్దా ?

రమణ : తద్దులు తీర్చేరు. నోములు వ్రతాలు ఒక్కటి కూడా వదలకుండా చేయించేరు. వాటి ఫలితం ఏమి కనిపించిం దమ్మా ?

కన : అట్లా అనకూడదమ్మా ! నీవు తప్పక వరలక్ష్మి వ్రతం చెయ్యాలి ?

రమణ : వరుణ్ణి ఎంచింది మీరు... లక్ష్మికై ఆశించింది మీరు. వాటి ఫలితం అనుభవిస్తున్నది నేను... చాలు అమ్మా ! ఇక ఏవ్రతాలువద్దు.

కన : లో కానికైనా వెరవవద్దా ?

రమణ : నడవడి సరిగాలేకపోతే వెరవాలిగాని, దీనికెందుకు ?

దాసు : ఈనాడు డబ్బున్న బాబులికి బుద్ధిచెప్పేవారు కనబడ్డం లేదు. వారుచేసే పనులవల్ల పైవాళ్ళకే గాకుండా, తమ వాళ్లకు, కడకు తమకు కష్టాలు తప్పుటలేదు.

కన : డబ్బు ఏమిచేసింది నాయనా! బుద్ధి కారణంగాని.

రమణ: బుద్ధి చెప్పకుండా, విపరీతంగా డబ్బు చేతికిస్తే అది భస్మాసురునికిచ్చిన వరంవంటిది కాదా ?

కన : డబ్బులేకుండా యీ ప్రపంచంలో బ్రతికేదెట్లా ?

రమణ: అమ్మా! మనం అనుభవిస్తున్న బాధలు డబ్బులేకా? డబ్బు ఎక్కువయ్యా ?

కన : మనకున్న దెంతమ్మా ? మనకన్న కుబేరుల్లాంటి వాళ్ళెందరు లేరు ?

రమణ: అట్లావున్న బహు కొద్దిమందినిచూచి పెడమార్గం పట్ట డంకన్న, రెక్కాడితేనేగాని డొక్కాడని కోట్లాది ప్రజానీకాన్ని చూచి ఏల సంతృప్తిచెందకూడదమ్మా ? వాళ్ళకన్న మనం అనుభవిస్తున్న అదనపుసుఖం ఏమిటి?

వాసు : తాపత్రయం, ఆందోళన, అనారోగ్యం వాటిమీద నడ్డీగా వచ్చే యితర పర్యవసానాలు...

కన : అట్లాగని ఆస్తి వదులుకోడానికి మనస్సు ఒప్పుతుందా ?

రమణ: కోట్లాది ప్రజల పొట్టలు ఎండి, మండిపోతుంటే మన లాంటివాళ్ళు కొద్దిమంది పెట్టెలు నింపుకోడానికి ప్రయత్నిస్తున్నారు. తమకు అనవసరమైనవాటినైనా లేనివారికి ఇవ్వడానికి మనస్సు ఒప్పడంలేదు. కాని అట్టివారు తమకు మున్ముందు రాబోయే అనర్థాలను గ్రహించ గలిగిన వారేనా ?

కన : గ్రహించినా, గ్రహించకపోయినా ప్రతి ఒక్కరు ఉన్నది నిలుపుకోవాలని, ఇంకా వీలైనంత సంపాదించాలనే ప్రయత్నిస్తారేగాని, దగ్గరవున్నది చేతులారా యిచ్చే మహాసీయులెక్కడున్నారమ్మా ?

దాసు. దురాశ అనే దీర్ఘవ్యాధి ప్రవేశించినవారి విషయం అంతేనమ్మా...

రమణ : కష్టించి, పండించి, తెచ్చిపోసిన కర్షకదేవునికి తిండిలేకుండా చేసి, తినని, తిరగని విగ్రహానికి నైవేద్యం పెట్టుటలోని అంతరార్థం ఏమిటమ్మా ?

దాసు : నరుల నరాలశక్తిని, వడ్డీరూపంలో వసూలుచేసి చీమలకు నూకలు—చేపలకు రామకోటిఉండలు వేసేవారు, మీరు చెప్పినవారు దురాశాదేవి కవలపిల్లలు.

రమణ : రేయింబవళ్లు రెక్కలు ముక్కలయ్యేటట్లు పనిచేసే పాటకజనాన్ని పస్తుండబెట్టి, పెంపుడుకొడుకులకు పెద్ద పెద్ద ఆస్తులిచ్చేవారో ?

దాసు : ఆ దేవియొక్క పెద్దకూతుళ్లమ్మా ?

రమణ : ఆ దేవి సంతతి ఆ విధంగా కూడబెట్టడంవల్ల వచ్చే లాభనష్టాలు ఏమిటాఅని ఎన్నడైనా ఆలోచించుకుంటారా ?

దాసు : అట్లాగే ఆలోచిస్తే యీ లక్ష్మీపురం, ఋషీపురం అయిపోదా ?

కన: పోనిస్తురూ.. ఈ గొడవలన్నీ మనకెందుకు ? అమ్మా ? నీవు వ్రతంమాట ఏమంటావు ?

కమల: అమ్మా ! నాకు ఎంతమాత్రం యిష్టంలేదు. తరువాత మీ చిత్తం.

కన. చెయ్యాలిస్తే... తప్పదు.

(తెర.)

---

"తమకున్న డబ్బు, అధికారం గురించి గొప్పలు చెప్పుకొనేవారు కొందరున్నారు. అయితే అవన్నీ క్షణభంగురాలు మాత్రమే, ఇవేవి మరణానంతరం మిగిలేవికావు."

"డబ్బుతో తిండి, బట్ట మొదలైనవి సంపాదించుకోవచ్చునేగాని, అదే ఆశయం, గమ్యం సర్వం అనుకోకూడదు."

—రామకృష్ణ పరమహంస.

# దత్తపుత్రశోకము

౪ వ రంగం.

[కోటేశ్వర్రావు రాజవాడ బస—హాల్లో సిగరెట్ కాలుస్తూ కూర్చుంటాడు—రంగడు గుమ్మం సమీపంలో తిరుగుతుంటాడు— డాక్టర్ విశ్వేశ్వర్లు ప్రవేశం]

కోటే: రండి!...రండి!... ఏమిటి ప్రొద్దున్నే యిలా దయచేసేరు?

డా॥విశ్వేశ్వర్లు: అబ్బే! ఊరికినే. మీతో మాట్లాడి వెడదామని.

రంగడు: మీరు పుట్టింది లౌఖ్యుల కుటుంబం, నేర్చుకున్నది వైద్యవృత్తి. చేస్తున్నపని రాజకీయాల్లో...మీరు ఊరికే వస్తారా ?

కోటే: మందుగురించి కంపెనీనుంచి సమాధానము వచ్చిందా ?

డాక్టర్. ఇంకా రాలేదండి ... అయితే రాష్ట్ర శాసన సభ బై-ఎలక్షన్ గురించి ఏంచేస్తున్నారు?

కోటే: మాబోటివాళ్ళకు ఆ గొడవలెందుకు పోనిస్తురూ.

డాక్టర్: అన్నివిధాల స్తోమతున్న మీకుగాకపోతే మరెవరికి...

కోటే: మీరు నామినేషన్ దాఖలుచేసేరా ?

డాక్టర్: నేవేస్తున్నది నెగ్గుతాననిగాదు. ముగ్గురుం నిలబడ్డప్పుడు మీకు మంచిఛాన్సు వుంటుంది, కాంగ్రెసు అపఖ్యాతి పాలై పోయింది. కాబట్టి ధనవంతులు వారి పలుకుబడిలో

ఉన్నవారు అంతా మీకే ఓట్లిస్తారు. లేబరువి మాకులం వాళ్ళవి కాంగ్రెసుకు పడకుండా నేనుచీలుస్తాను. అందుచే మీరు ' స్యూర్ '.

రంగ : పిల్లికి పిల్లికి తగువుపెట్టి డాక్టరుగారు కోతిపాత్ర వహించ దలచుకున్నారేమిటి ?

డాక్టర్ : కన్ట్రాడిక్షన్. నీ కేమి తెల్సునోయ్...

కోటి : ఇప్పుడున్నవాటితోటే చస్తుంటే, కొత్తగా ఈ ఎలక్షన్ వ్యసనం ఎందుకు నేర్పుతారు పోనిస్తురూ.

డాక్టర్ : అవకాశం ఉన్నప్పుడు ఊరుకోకూడదు. ఒక్కసారైనా ఎం. ఎల్. ఎ. కావాలి...ముందు ముందు పరిస్థితులు ఎల్లావుంటాయో ?

రంగ : అవును...డాక్టరుగారూ ! మొన్న మీరు మీటింగులో మాట్లాడుతూ డబ్బున్నవాళ్లు ప్రజాప్రతినిధులు కాకూడదని బల్లగుద్ది చెప్పారే ... ఇప్పుడు కోటేశ్వరావుగారు ఎం. ఎల్. ఎ. కావాలంటున్నారేమిటి ?

డాక్టర్ : (నవ్వుతూ) అది పబ్లిక్ మీటింగు ... అక్కడల్లా మాట్లాడాలి...నీకెందుకు, వెళ్ళి నీపని ఏదో చూచుకో.

రంగ : అంతేలెండి. ఇటువంటి ఎలక్షన్ రాజకీయాలు మీలాంటి లిటిగెంట్లకు, మా బావగారులాంటి భాగ్యవంతులకే లెండి.

డాక్టర్ : మీరు నిలబడితే మనవూరువాళ్లు, మీ బంధుకోటి అంతా నడుంకడతారు. మన వూళ్లోను, చుట్టుప్రక్కల గ్రామాల్లోను మీ భూములు చేసేవాళ్లు చాలామంది వున్నారు. వాళ్లంతా సైన్యంలా కదలి పనిచేస్తారు. అందుచేత డబ్బు ఆట్టే ఖర్చుకాదు. మీ రేమి అడ్డు చెప్పకండి.

కోటే : మీరు మీ పార్టీవాళ్లు సహాయంచేసేటట్లయితే దిగాలి గాని, లేకపోతే లాభంలేదు.

డాక్టర్ : మీకెందుకు...అవన్నీ మేము చూచుకుంటాము. ఈ ఫారాలుమీద సంతకాలు పెట్టండి.

(డాక్టర్ ఫారాలిస్తాడు. కోటేశ్వరావు సంతకాలు పెడతాడు)

డాక్టర్ : మరి సెలవు...

(నామినేషన్ ఫారాలు తీసుకొని డాక్టరు వెడతాడు)

రంగ : బావగారు వెన్నపూసలాంటివారు.

కోటే : ఏడిసేవ్....

(కుర్చీలో వెనుకకు జేరబడి ఆలోచిస్తుంటాడు. రోజా ప్రవేశం)

రోజా : ఆ ఎలక్షన్ గొడవలు మనకెందుకండి.

కోటే : వాటంతటవి వచ్చిపడతుంటే, వద్దంటమేమికర్మం ?

రోజా : ఎలక్షన్‌అంటే అన్నిటికంటె పెద్ద జూదమాట. మీ లాంటివారు అసలే దిగకూడదు.

శే: ఏమిటండి.. ముందే యీ అపశకునపు మాటలేమిటి?

రోజా: ఏగేటోగా ఆలోచించుకోవాలే గాని, దిగింతరువాత సుడిగుండంలో పడ్డట్టే.

శే: సరే.. ఎలాగ జరగవలసింది అలా జరక్క తప్పదు.

రోజా: తెలిసివుండీ చేస్తూ ఆ వైరాగ్యంమాట లేమిటి?

(వ్యాఘ్రేశ్వరరావు వస్తాడు, రోజా లోనికి వెడుతుంది.)

శే: కూర్చోండి. డాక్టర్ విశ్వేశ్వర్లు వచ్చి యింతకుముందే వెళ్ళేడు.

వ్యా: పొద్దున్నే వచ్చేడు. అంతా కులాసాగా వున్నారా?

శే: అబ్బే! వైద్యానికిగాదు. బై-ఎలక్షన్ నామినేషన్ గురించి.

వ్యా: మరి ఏం చేసేరు?

శే: నామినేషన్ ఫారాలమీద సంతకాలు పెట్టించి పట్టుకు పోయేడు.

వ్యా: నన్ను కాంగ్రెసు సెలక్టుచేసినవిషయం మీకు తెలియదా?

శే: ఇంతవరకు మీరు చెప్పలేదే.

వ్యా: పేపర్లలో పడింది. అందరూ చెప్పుకుంటున్నారు. 'కన్‌ఫర్మేషన్' వచ్చిన తరువాత చెబుదామని ఊరుకున్నాను. మీకు అసలు యిటువంటి వుద్దేశాలు ఉన్నట్లు ఎప్పుడూ చెప్పలేదే...

కోటే: ఇదివరకే ప్రజాపార్టీ నాయకులు వచ్చి పట్టుబడితే తరువాత తెలియజేస్తానని పంపివేసేను. ఈవేళ ఆపార్టీ తరపునే వేసేను.

వ్యా: మనం, మనం తగవులాడడం ఏమంత మంచిదిగాదు. పోనీ నేను తగ్గినా మీకు ఛాన్సుఉండదు. అదీగాకుండా కాంగ్రెసు ఆలిండియాపార్టీ. పెద్దవాళ్ళ నందరిని దిక్కరించి నట్లవుతుంది. అంతేగాకుండా అప్పుడే బోలెడు డబ్బు ఖర్చుపెట్టేను. నాకు నెగ్గే 'ఛాన్సెస్' బాగా వున్నాయి. అందుచేత అన్నివిధాల మీరు ఉపసంహరించుకోవడం మంచిది.

కోటే. అదెల్లావీలవుతుంది. మీరుకూడా బాగా ఆలోచించండి. ఇది చిన్న 'టరము'. ఈసారి నాకు వదలివేసి, జనరల్ ఎన్నికలలో మీరు నిలబడండి.

వ్యా: మీరు రంగంలోకి దిగితే డబ్బు చాలా ఖర్చుఅవుతుంది. అప్పులవాళ్ళు కంగారుపడి... వారంట్లుఅవీ పెడతారు.

కోటే: పెట్టదలచినవాళ్ళు ఎప్పుడైనా పెట్టవచ్చు. అంత మితిమీరివస్తే ఆస్తి అమ్మిపారవేస్తా.

వ్యా: మనం యిద్దరం నిలబడితే మనకువచ్చే ఓట్లు చీలిపోవడం ఆ కమ్యూనిస్టుపార్టీ సీటు కొట్టుకుపోయే ప్రమాదం వుంది.

గోపే: ఆ పప్పులెక్కడుడుకుతాయి.

వ్యా: కాదు... మీరు ఉపసంహరించుకోండి. లేకపోతే 'స్క్రూటినీ'లో మిమ్మల్ని 'డిస్‌క్వాలిఫై' చేయించాల్సి వుంటుంది.

గోపే: ఏవిధంగాను ?

వ్యా: మీకున్న వ్యాధిని చెప్పి...

(ఆమాటలు వినడంతోనే గోపేశ్వరావు నిర్ఘాంతపోతాడు.)

గోపే: ఏంవ్యాధి ?... నాకు ఆ వ్యాధివుందని ఎవరన్నారు ?

వ్యా: నిదానించినవాళ్ళు మీ ముఖం, చేతుల నిగనిగలను బట్టి ఊహించలేరా ? మీ కేన్వాస్ షూ తీస్తే అన్నీ తేలి పోతాయిగా...

గోపే: అబ్బ... అంతవరకూ వచ్చిందన్నమాట సరే.

వ్యా: అదేనా మీరు చెప్పేది ?

గోపే: లేకపోతే మీరు బెదిరించి చేసేదేమిటి ?

వ్యా: మీ మేలుకోరి చెబుతున్నాను.

గోపే: నా మేలుకోరేవాళ్ళ ప్రవర్తన అట్లావుండదు.

వ్యా: నామాట వినకపోతే, చాలా చిక్కుల్లోపడతారు.

గోపే: చాలు... ఎవరు చెయ్యగలిగింది వారు చేసుకుందాం. ముందు యిక్కడనుంచి దయచెయ్యండి.

వ్యా: ఇక్కడ ఉండడానికి నాకేంపని ?

(వ్యాఘ్రేశ్వరరావు కోపంతో వెడతాడు.)

[కోటేశ్వరరావు 'టీపాయ్' మీదనున్న గ్లాస్ టంబ్లర్ నుంచి నీళ్లు గ్లాసులో ఒంపుకొని త్రాగి, వెనుకకు జేరబడి ఆలోచిస్తాడు. కొద్దిసేపయిన తరువాత ఉత్తరం వ్రాయడం ప్రారంభిస్తాడు.]

కోటే: రంగా!...... ఒరే రంగా!

రంగ: (దగ్గరకువచ్చి) ఏమిటి సెలవు ?

కోటే: ఈ ఉత్తరం తీసుకువెళ్ళి డాక్టర్ విశ్వేశ్వర్లుగారికిచ్చి, నేను సంతకాలు పెట్టిన నామినేషన్ ఫారాలు తీసుకురా.

(ఉత్తరం తీసుకుని రంగడు వెడతాడు.)

(తెర.)

---

" ప్రభుత్వం శుద్ధమైన, శక్తివంతమైన ప్రజాతంత్ర పద్ధతిని అనుసరించిన, అది మహాబలవంతుడైన మగధ చక్రవర్తి అజాతశత్రు లాంటివారి తీవ్రదాడులను సహితము తట్టుకోగలదు. అభేద్యముగా నిలువగలదు "

—బుద్ధ.

# దత్తపుత్రశోకము

## ౫వ రంగం.

[లక్ష్మీపురం గ్రామచావిడివద్ద, సమయం: సాయంకాలం నాలుగు గంటలు. మరొక గంటలో జరుగనున్న సర్వోదయ సభకు ఒక్కొక్కరే వస్తూ ఉంటారు. గోపాలం, మరికొందరు రైతులు ఆ చావిడీ అరుగుమీద కూర్చుని ఉంటారు—డాక్టరు విశ్వేశ్వర్లు మరొక కమ్యూనిస్టుపార్టీ పెద్ద ప్రవేశం.]

డాక్టర్ : నేను ఈ బై-ఎలక్షనుకు నిలబడ్డాను. కోటేశ్వరరావు గారు నిలబడతారు అనుకుంటే ఆయన ఎందుచేతనో మానివేశారు. మన ప్రాంతంలో ఓటర్లయిన స్త్రీలు, పురుషులు అంతా ఆ నాకు ఓట్లు యివ్వడమే గాకుండా, మీరంతా యిప్పటినుంచి సమంగట్టి గట్టిగా పనిచెయ్యాలి. మనపార్టు జయంపొందినదనిపించాలి.

గోపాలం : అవునవును . . మీరు పుట్టింది ఈ వూరేగదూ ... మీరు ఎం. ఎల్. ఎ. అయితే ఈ వూరువాళ్ళందరు జయంపొందినట్లెలెక్క. ఇదెక్కడ కమ్యూనిజమయ్యా?

డాక్టర్ : అబ్బే! మీతోవుండే చనువుకొద్దీ అలా అన్నాను గాని, అసలుపార్టీనిబట్టి, అది ప్రకటించిన ప్రణాళికను చూచే యివ్వాలి.

గోపాలం: అంతేనా .. పార్టీ పేరిట చేసిన పనులనుబట్టి, నిలబడ్డ వ్యక్తి మంచిచెడ్డలనుబట్టి ఆలోచించవద్దా? అయితే యీ మధ్య మీకు కోటేశ్వరావుగారికి మధ్య నడచిన రాజకీయ రాయబారాలేమిటి?

కమ్యూనిస్టుపార్టీ పెద్ద: అబ్బే! వారికి పార్టీకి ఏమి సంబంధం వుంది? వారు పెద్ద భూస్వాములు. మాది కార్మిక, కర్షకుల పార్టీ.

గోపాలం: ఆహా!...అల్లాగా.

క. పార్టీ పెద్ద: మాది అంతర్జాతీయపార్టీ. రష్యాలో, చైనాలో..

గోపాలం: చాలు_చాలు_చెట్టు పేరు చెప్పి కాయలు అమ్మ ప్రయత్నించకండి. గతంలో చేసింది ప్రస్తుతం చేస్తున్నది సెలవివ్వండి చాలు.

క. పార్టీ పెద్ద: మేము చెప్పేది పూర్తిగా వినకపోతె ఎట్లా?

గోపాలం. విని విని విసిగిపోయేం. ఎందుకా డొంకతిరుగుడు సమాధానాలు. అడిగినదానికి సూటిగా జవాబివ్వక.

క. పార్టీ పెద్ద: సరే. మీకు యిష్టమైతే కంకి కొడవలి గుర్తు పెట్టెలో వోట్లు వెయ్యండి.

డాక్టర్: ప్రక్క 'వానమూరు'లో మాపార్టీ మీటింగు జరుగుతుంది. అందులో ఎం. శేఖర్‌గారు మాట్లాడుతారు. మీరంతా వచ్చి, అనుమానాలన్నీ తీర్చుకోండి.

(డాక్టరు, క. పార్టీ పెద్ద వెడతారు.)

గోపాలం: ఓహో... అప్పట్లో శేఖర్‌గారి కులంవాళ్ళు ఎక్కువగా ఉన్నారని ఆయన్ని దింపేరన్నమాట.

ఒక రైతు: పోనివ్వరా... ఏదో చెప్పుకుపోతారు. నువ్వేమిటి వాళ్ళని పట్టుకు అలా తోమేస్తావు...

మరో రైతు: ఆ... అల్లా అడక్కపోతే మరీకోతలు కోస్తారు. వచ్చినవాళ్ళని అలా నిలేసి అడగాల్సిందే.

వేరొక రైతు: ఇన్నాళ్ళనుంచి ఓట్లు వేస్తున్నాం...ఏమొచ్చింది?

మరో రైతు: ఎలక్షన్ అనేసరికి దిగుతారేగాని, మన కేదైనా వచ్చినప్పుడు ఒకళ్లూ కనుపించరు.

(వ్యాఘ్రేశ్వరావు మరో కాంగ్రెసు నాయకుడు, వెంకటేశ్వర్లు వస్తారు.)

కాంగ్రెసు నాయకుడు: రేపు జరగబోయే బై-ఎలక్షన్‌కు కాంగ్రెసు వ్యాఘ్రేశ్వరావుగారిని నిలిపింది.

గోపాలం: అంతకన్న మరెవ్వరు దొరకలేదా?

కాం. నాయకుడు: మీరు నిలబడ్డ వ్యక్తినిచూచిగాదు, గాంధీ మహాత్ముని తలచుకొని, నెహ్రూ పండితుని మాటలువిని కాంగ్రెసును గెలిపించండి.

వ్యా: కాంగ్రెసుప్రభుత్వం పంచవర్ష ప్రణాళికలద్వారా కమ్యూనిటీ ప్రాజెక్టులద్వారా రైతాంగానికి ఏంతో సహాయం చేస్తుంది.

గోపాలం: చేస్తున్నమాట నిజమే. కాని అది మాలాంటి పేదా, సాదా వాళ్ళకన్న, మీలాంటి పెద్దవాళ్ళకు బాగా సహాయపడుతూంది.

కాం. నాయకుడు : గాంధీగారికన్న పేదప్రజల కొరకు పనిచేసిం దెవరు ?

గోపాలం: అలాచెప్పే బండి దొర్లించేస్తున్నారు.

వ్యా : త్వరలోనే కాంగ్రెసుప్రభుత్వం భూమి శాసనాలు చెయ్య బోతుంది.

గోపాలం : నిజంగా చెయ్యదలచుకుంటే, ఇప్పుడున్న అడ్డేమిటి? బిల్లు పెట్టిందిలేదు, శాసనం వచ్చిందిలేదు. కాని వస్తుం దనే హడావిడిఎక్కువై భూస్వాములు మమ్మల్ని భూము ల్లోనుంచి లేవగొట్టేస్తున్నారు.

కాం. నాయకుడు : మీ గ్రామానికి ఏమైనా పనులు అవాలంటే కాంగ్రెసుకే ఓట్లుయివ్వాలి.

శంక : పేట అంతా కాంగ్రెసుకు యిస్తామని వాగ్దానం చేసేరు, మీరుకూడా ఆలోచించండి.

గోపాలం : ఆలోచించాలి... తప్పకుండా ఆలోచించాలి... తమ్ముడు అటు, అన్న యిటు ఆడుచున్న అవకాశవాద నాటకాలు బాగా ఆలోచించవద్దా? పేట పెద్దలకు ఏమి ముట్టజెప్పించేరు ? మీ కేమి ముట్టింది ?

వ్యా : మన దేశీయ మహాసంస్థను గెలిపించుటకు మీరంతా జోడెద్దుల గుర్తు పెట్టెలో ఓట్లువెయ్యాలి.

(వ్యాఘ్రేశ్వరరావు, కాంగ్రెసు నాయకుడు, శంక వెళ్ళిపోతారు.)

గోపాలం: ఆనాడు దేశీయ మహాసంస్థ అయితే, నేడది ధనికుల మహాసంస్థ.

ఒకరైతు: ఏపార్టీ మనకు ఒలకబోసిందిలేదు.

మరోరైతు: కాంగ్రెసు లేనివాళ్ళకు చేసే మంచి అంతగా లేక పోయినా, బాగా ఉన్నవాళ్ళకు ఇంకా పోగేసుకోడానికి కొద్దో, గొప్పో సాయం చేస్తానేవుంది.

గోపాలం: ఎదిరించి అడిగే దాతలేక అధికారంలోవున్నవాళ్ళకు మరీ తల తిరిగిపోతుంది.

వేరొకరైతు: మిగిలిన పార్టీలన్నీ కలిస్తే బాగుండును.

గోపాలం: అంతా ఓట్లు వేటగాళ్ళే అయిపోతున్నారు. ప్రజలు సంగతులు బాగా తెలుసుకొని, ఐకమత్యంగా ఉద్యమం సాగిస్తే తప్ప మనకు లాభం వుండదు. ఓట్లు యిస్తేనే మన దరిద్రం తీరిపోతుందనుకోవడం వెర్రి.

ఒకరైతు: మన దరిద్రం ఇక ఒకటితీరటం...

మరోరైతు: ఇప్పుడప్పుడు అసలు మీటింగు పెట్టేవారు యింకా రాలేదేమి...టైము అయింది. వారేపార్టీ ?

గోపాలం: వారు ఏ పార్టీగాదు. వారికి ఓట్లతో ఏమీ సంబం ధము లేదు. వారు భూదాన ఉద్యమానికి సంబంధించిన వారు. అరుగో వస్తున్నారు.

(శ్యామ్‌సుందర్ ప్రచారకదళ సభ్యులు వేదికమీదికి వస్తారు—దళంలోని యువతి మైక్ దగ్గరకు వచ్చి పాడుతుంది.)

పాట:

ఐక్య మన్నది పెంచుమన్నా
భేద భావము వీడుమన్నా
దేశ మంతట మనుజు లందరి
మేలుకోరి కదలి రావోయ్—
కూడుగుడ్డకు కొదువ తీర్చగ
ప్రజల కండగ నిలువ వలెనోయ్
పేరు గొప్పలు మరచి నేడూ
ఆంద లోకమై సాగవలెనోయ్—
చిమ్మ చీకటి చీల్చి యిపుడూ
దేశ జనులకు ఆశ కలుగగ
కార్యకర్తలు ముందు నడచీ
కాంతిరేఖలు చూపవలెనోయ్—
బాధ నిండిన బ్రతుకు బాటలో
శాంతి సుఖములు నింప వేగ
స్వార్థమన్నది అణచివేసీ
త్యాగవాహిని పొంగవలెనోయ్—
కులము, మతము, పార్టీ యంచు
మనిషి మనిషిని వేరు చేసే
కష్టలన్నిటి నధిగమించీ
జనుల హక్కులు తీర్చవలెనోయ్—

(యువతి వెనుకకు వెళ్ళుతుంది.
శ్యామసుందర్ మైక్ దగ్గరకు వస్తాడు)

శ్యామ్ : సోదరీ, సోదరులారా !

సమాజంలో ఆర్థిక అసమానత్వం ఉన్నంతకాలం, శాంతి, సౌభ్రాతృత్వం అసాధ్యం. అసమానత్వంయొక్క పరిణామాలే అన్యాయాలు, అక్రమాలు, అశాంతి.

మన దేశపరిస్థితి ఏమీ బాగుగాలేదు. పేదరికం, అజ్ఞానం, అనారోగ్యం, భిన్నత్వం, వ్యత్యాసం ఎంతగానో వుంది. మనలో అనేకులు తిన తిండీ, కట్ట బట్ట, నిలవ నీడ లేక కృంగి, కృషించి, కుమిలిపోతుంటే చూస్తూ వూరుకోవడం మానవత్వం అనిపించుకోదు.

భూమి పరిశ్రమలు మొదలగు ఉత్పత్తి పరికరాలు, వ్యక్తిగత యాజమాన్యంక్రింద ఉండుటచే యజమాని—కూలి అనే తేడాలు ఏర్పడుతున్నాయి. అందుచేతనే శాయకష్టం చేసేవారిని చిన్నగాను. పై పెత్తనం చేసే వారిని గొప్పగాను చూస్తున్నారు.

"భూమి ఎవరిసొంతమూకాదు గాలి, నీరు, వెలుతురు, ఆకాశము ఎవరిసొత్తో భూమికూడా వారి సొత్తే అంతా సమాజానిదే." అన్నారు. వినోబాజీ.

ఏ గ్రామంలో నున్న భూమి, పరిశ్రమలు ఆ గ్రామస్థు లందరి సమిష్టి హక్కు కావాలి. అప్పుడే ఉత్పత్తిని పెంచుటకు ఉత్సాహం పెరుగుతుంది.

పేదప్రజలు తమ కష్టాలను భరించలేక తిరుగుబాటు చేయకముందే అధిక భాగ్యాలు కలిగి ఉన్నవారు, పరిస్థితులు అవగాహన చేసుకొని, త్యాగం చెయ్యాలి. అప్పుడే శాంతియుత విప్లవం సాధ్యం. భూస్వాములు త్యాగబుద్ధితో యిచ్చినా, యివ్వకపోయినా వ్యవసాయం చేసేవారికి ఏదో విధంగా భూమి చేరి తీరుతుంది. అది తప్పదు. అది చట్టంద్వారానో, ఆయుధాల ద్వారానో జరుగుతుంది. కాని మేము కోరేది ప్రేమ, ఐక్యతలద్వారా సిద్ధింగావాలని. అందరిహృదయాల్లోను, ప్రేమ ఉత్పన్నమవడానికే ఈ భూదాన ఉద్యమం. ఏ ఉద్యమమైనా విజయవంతం కావాలంటే ప్రజలు చైతన్యవంతులు కావాలి. సంఘటిత మవ్వాలి. ఐక్యతతో ప్రజాఉద్యమం అభివృద్ధిచెందిననాడు, ఆ జనశక్తి ప్రజా సమస్యలను పరిష్కరించగలుగుతుంది. దురదృష్టవశాత్తు నేడు రాజకీయ పార్టీల నాయకులు ప్రజల హక్కులకై, ప్రజలతో ప్రజాఉద్యమాలను సాగించక, అధికార వ్యామోహంలోబడి, ప్రజలపేరిట వ్యాపారం సాగిస్తున్నారు. పొడుగాటి కార్యక్రమాలు ప్రకటించి, ప్రజలను మోసగిస్తున్నారు. ఏకీభవించిన విషయాల గురించి అయినా కలసి పనిచేయక, భిన్నాభిప్రాయాలకై తర్క వితర్కాలతో తగువులాడుతున్నారు. దీని పర్యవసానంగా ప్రజల

లో నిస్పృహా, నిరాశ, నిరుత్సాహం బయలుదేరింది. ఉత్తమ కార్యకర్తలలో సహితం ఉత్సాహం సన్నగిలింది. ఇట్టి పరిస్థితులలో చైతన్యవంతులైన ప్రజలు, ఉత్తమ కార్యకర్తలు, స్వార్థపరనాయకుల ప్రజావ్యతిరేకచర్యలను జాగ్రత్తగా గ్రహించి, పార్టీ విభేదాలు పాటించకుండా దేశాభ్యుదయంకొరకు కలసి పనిచెయ్యాలి.

ఆర్థిక అసమానత్వాన్ని తొలగించాలనేది పూజ్య బాపూజీయొక్క ఆశయం. దానిని సాధించుటకే వినోబాజీ భూదాన యజ్ఞం సాగిస్తున్నారు. దానిని జయప్రదం గావించి, ధర్మాన్ని స్థాపించి, శాంతిని నెలకొల్పుటకై కృషిచేయుట మన అందరి సమిష్టి కర్తవ్యం.

గోపాలం: అయ్యా! తమరు చెబుతున్న విషయాలన్నీ నిజమే. అయితే మాకు కొన్ని సందేహాలున్నాయి, మరోలా అనుకోక వాటికి సమాధానాలు యిస్తారా?

శ్యామ్: తప్పక... మీరు సందేహాలు నివృత్తిచేసుకొని, సమస్యను సరిగా అర్థంచేసుకొని మీరంతా కార్యరంగంలోకి దిగినప్పుడే మన అందరి ఆశయం సిద్ధించేది.

గోపాలం: కమ్యూనిస్టుపార్టీ నాయకులు 20 ఎకరాలు మాగాణిగాని, దానికి సమాన విలువగల మెట్టభూమిగాని వదలి పెట్టి, మిగిలినది పంచాలంటున్నారు. అది సరియైన పద్ధతేనా?

శ్యామ్: అది కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని అనుసరించి చెప్పింది గాదు. సోషలిజాన్ని స్థాపించిన సోవియట్ యూనియన్ లో అమలుపర్చిన పద్ధతిగాదు. అది ధనికరైతుల, చిన్న భూస్వాముల వాంఛమాత్రమే. శ్రామికవర్గ పార్టీ పేరిట ఆ నినాదం యివ్వడం మోసం. భూమి వ్యక్తిగతఆస్తిగా వుండ వీలులేదు. 'బాబా' చెప్పినటుల అది సమాజపరం కావాలి. కష్టించి పండించే కర్ష కానకికి పూర్తి ఫలితం పొందే హక్కు ఏర్పడాలి.

స్వామి: కష్టపడి సంపాదించుకొని, బోలెడేసి డబ్బుపెట్టి కొనుక్కున్న భూములు వదులుకోమనడం ఎలాటి న్యాయం అయ్యా!

గోపాలం: చాలా కష్టపడి, చాలా నిజాయితీగా సంపాదించేవు. పాపం! నీలాంటి నడమంతరపు సిరిగాళ్ళకు మరీబాధ.

శ్యామ్: కష్టించి పనిచేసే ప్రజానీకం సర్వ సాధారణంగా పెద్దగా కూడబెట్టటం లేదు. నేను వారి ఆదాయం, వారి కుటుంబాల పోషణకే దడాదడిగా వుంటుంది. ఒకవేళ అప్పుడప్పుడు కొద్దిగా మిగిలేవారుకూడా అంతగా ఆందోళన పడటంలేదు. పడనవసరంలేదు కూడా. ఇక ఎటొచ్చి పరుల శ్రమశక్తిని అన్యాయంగా కూడబెట్టినవారే, ఆందోళన చెందుతున్నది. ధర్మానికి విరుద్ధంగా గండర

గోగం చేస్తున్నది కూడా అట్టివారే. అందులో కూడా బుద్ధిమంతులు, ప్రపంచంలో వస్తున్న మార్పును గ్రహించినవారు పరిస్థితుల కనుగుణ్యంగా మారడానికి ప్రయత్నిస్తున్నారు

గోపాలం: కాంగ్రెసు ప్రభుత్వం కౌలు శాసనం చేసిందీలేదు, పెట్టిందీలేదు. కాని, పేపరుప్రకటన చేసి మాకొంపతీసింది, మమ్మల్ని భూముల్లోనుంచి లేవగొట్టేస్తున్నారు. దానికి ఏమిచెయ్యమంటారు ?

శ్యామ్: పెద్ద భూస్వాములు, పేద కౌలుదార్లను భూముల్లో నుంచి లేవగొట్టడం అన్యాయం. ఈ ప్రభుత్వం తనంతట తానే శాసనం చేస్తుందని, చేతులు ముడుచుకు కూర్చోవడం వెర్రితనం. అన్యాయానికి అక్రమాలకు వ్యతిరేకముగా ఐక్యతతో నిలబడాలి. ధర్మంకోరకు, శాంతియుతంగా ప్రతిఘటించాలి. ఆవిధంగా నాలుగుమూలల జరిగితే ప్రభుత్వంకూడా శాసనం చెయ్యకతప్పదు.

గోపాలం: బాబూ! మీరు చెప్పింది బాగుంది. మీరు వచ్చిన విషయం ఏమిటో, ఇంకా చెప్పదలచినసంగతులు ఏమిటో సెలవియ్యండి.

(తెర.)

"ఈ దేశంలో ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా అట్టడుగునకు అణగద్రొక్కబడిన అమాయికపు పేద, పీడిత, ప్రజానీకానికి మిత్రులు బహు అరుదుగా ఉన్నారు. నేటి సమాజంలో ఆ ప్రజలు వివిధ రకముల దెబ్బలకు గురిఅవుతున్నారు. వారిని పైకి తీసుకురావలసిన బాధ్యత యువజనులపై వుంది. అందుచే ఆ పేద ప్రజానీకానికి సంగతులు తెలియజెప్పి, చైతన్యవంతుల్ని చెయ్యాలి. వారిలో అణిగివున్న శక్తుల్ని కేకత్రించి, వారు తమ ఆకలిబాధను తీర్చుకొనుటకు మానవులుగా జీవించుటకు తోడ్పడాలి. మన శాస్త్రాలలో మానవునికి యెట్టి గౌరవం యివ్వబడిందో తెలియజెప్పి, ఆ స్థితికి వారు అభివృద్ధిచెందుటకు తోడ్పడాలి."

"నిజమైన దేశభక్తుడు మూగ ప్రజానీకంయొక్క కష్టాలను తెలుసుకున్నతోడనే, తక్షణం పూనుకొని వాటిని సాధించేవరకు విశ్రమించరాదు. నిజమైన ప్రేమ సానుభూతులతో, దేశంలో దుర్భర దారిద్ర్యం అనుభవించేవారి బాధలకు పరిష్కార మార్గం చూపుటకు పూనుకోవాలి."

"దేశభక్తుడు ధనం, అధికారం, పేరు కీర్తులు అనే వ్యామోహాలకు లోనుకారాదు. చాల మంది దేశభక్తులు, రాజకీయవేత్తలు, సంఘ సంస్కర్తలు ఆ వ్యామోహాలనే గడ్డుశిలకు తగులుకుంటుంటారు. ఉత్తమ దేశభక్తుడు, రాజకీయవేత్త ఆ శిలకు తగులకోకుండా తన జీవిత నౌకను నడుపుకోవాలి."

"ఉత్తమ మానవ నాగరికతను ఏర్పరచుకొని, సర్వతోముఖాభివృద్ధి చెందదలచిన ప్రపంచం యావత్తు భారతదేశంలోని అమూల్యమైన జ్ఞానసంపదవైపు జూస్తూంది. మనసంపదను గ్రహించి, మనం అవర్ణ్యప్రాయంగా మెలగి ఉన్నతస్థాయికి అభివృద్ధిచెందిన యావత్ప్రపంచానికి మార్గదర్శులమయ్యే అవకాశం వుంది." —వివేకానంద

# దత్తపుత్రశోకము

ఉపరంగం.

[మొకటి రంగంలో వలెనే]

మహా : ఏమిటి బాబూ! నిన్న మీటింగులో భూముల గొడవ ఏమేమో చెప్పేరట.

శంక : గాంధీగారిలాంటి ఆయన ఒకః దేశమంతా కాలినడకను తిరిగి, ధర్మబోధ చేస్తున్నారు. ఆ మహనీయుడు కలిగున్న వారినుండి భూమి, సంపద దానంగా తీసుకొని లేనివారికి పంచుతున్నారు. మీటింగు పెట్టింది ఆసందర్భంలో.

మహా : పెద్దపెద్ద ఆస్తులున్నవారి భూములు లాక్కుంటారంటు న్నారు. ఎంతవరకు నిజం బాబూ!

వాసు : అమ్మా ! 'నలుగురితోపాటు నారాయణా' అనుకోక ఎందుకీ ఆందోళన...

శంక : ఎంక్వయిరీలుచెయ్యడం, రిపోర్టులు ప్రకటించడం తప్పితే యింతవరకూ బిల్లులేమీ తేలేదు.

వాసు : అయితే యీ ఆక్రంగారంతా దేనికి ?

మహా : ముందు రాబోయేదేమిటో తెలుసుకు జాగ్రత్తపడవద్దూ, బాబూ ! ఆ బిల్లు వచ్చినప్పుడు ఎట్లావస్తుందనుకుంటు న్నారు...

శంక : ఏడాదికి రెండువేలో, మూడువేలో ఆదాయం వచ్చే భూమి కుటుంబానికి వదలిపెట్టి, మిగిలిన భూమికి కొద్దిగా నష్టపరిహారం యిచ్చి తీసుకుంటారేమో...

మహా : కొద్దిగా అంటే ఏమాత్రం?

వెంక : బహుశా భూమిపన్నుకు పది, పండ్రెండు రెట్లుకు లోపు యివ్వొచ్చు.

మహా : అన్యాయం... అష్టకష్టాలు పడి ఆర్జించుకున్న ఆస్తులు ఆవిధంగా తీసుకోవడమే.

వెంక : తక్షణం కాకపోయినా త్వరలో తప్పదు.

మహా : పాడుకాలం వచ్చింది. అయితే వీటినుంచి తప్పించుకునే ఉపాయం ఏదీలేదా బాబూ.

దాసు : వైరాగ్యం ఒక్కటే చక్కటి ఉపాయం.

వెంక : పిల్లలున్నవాళ్లు పంచుకున్నట్లు పారీకత్తులు వ్రాసుకుంటున్నారు. కొందరు భూములు అమ్మి డబ్బు చేసుకుంటున్నారు.

దాసు : బిడ్డలుంటే యీ బాధే లేకపోను. ఇక బాబుగారి పేర యిదివరలో పెట్టింది హారతికర్పూరం అయేపోయింది.

(స్వామి ప్రవేశం.)

మహా : దాసూ! ఒకసారి రమ్మంటున్నానని మా తమ్ముణ్ణి తీసుకురా.

(దాసు వెడతాడు.)

బాబూ! పోనీ మనంకూడా కొంత అమ్మివేద్దాం. క్రియాలు ఎట్లాఉన్నాయి?

వెంక : పెద్దవాళ్లు ఎవరూ కొనడంలేదు. ఎవరికి వారే అమ్మ డానికి ఎగబడుతున్నారు. సామాన్యులు ఎకరం, రెండు ఎకరాలు దాటి కొనడంలేదు.

స్వామి : ధరలుకూడా సగానికి సగం పడిపోయేయి.

మహా : చూడండి. ఎవరైనా కొనేవాళ్లుంటే ముందు ఆ చెరువుల్లో ఒదిలించివెయ్యండి.

వెంక : అలాగే ప్రయత్నం చేస్తానమ్మా.

స్వామి : ఆకౌలుకు చేసేవాళ్ళకు పొయ్యేకాలం వచ్చింది. వాళ్లు చేలల్లోనుంచి లేవడం కష్టం అమ్మా!

మహా : అవును బాబూ! కౌలుబిల్లు అట ఏమిటి?

వెంక . అది తొందరలోనే వచ్చేటట్లుంది. వ్యవసాయం చేస్తున్న రైతులను భూములనుండి తొలగించుటకు వీలుండదు. పండిన పంటలో మూడోవంతో, నాలుగోవంతో దాటి పుచ్చుకోకూడదు. ఇంకా కొన్ని ఇలాంటి షరతులే ఉంటాయి.

మహా : స్వయంగా చేస్తే కూలీలతో ఏగటం కష్టంగావుందా... అమిరిస్తే అసలుకే మోసమా... ఇక మాలాంటివాళ్ళు బ్రతకడం కష్టం.

స్వామి : ఇప్పుడు చేస్తున్నవాళ్ళు అయినా, సుఖ సుఖాల్ని కదిలేటట్లు లేరు.

మహా : ఏం బాబూ!

వెంక : ఈ బిల్లులు భ్రమకొద్ది చేలల్లోనుంచి కదలడం కష్టంగానే వుంది. అందుచేతనే కొందరు కంగారుపడి, ఎకరానికివంద రెండువందలూ ఎదురిచ్చి, స్వాధీనం చేసుకుంటున్నారు.

స్వామి : ఏదోవిధంగా లాక్కున్నా, బిల్లు వచ్చింతరువాత గతంలో చేసేవాళ్ళకే వస్తాయి అనుకుంటున్నారు.

వెంక : అబ్బే... ఎవళ్ళకు తోచినట్లు వాళ్ళు అనుకుంటున్నారు. అంతేగాని అదేమీ చెప్పలేము.

మహా : ఈ దిక్కుమాలిన గవర్నమెంటు, మాయదారిపార్టీలు మనల్ని దిబ్బచెయ్యడానికి వచ్చేయి.

వెంక : మార్పులు తప్పదు... ప్రపంచమే మారిపోతుంది.

మహా : బాబూ! ఆ చిల్లరిప్రతులు అమ్మకానికి, కౌలురైతుల నుండి భూములు స్వాధీనం చేసుకోడానికి తక్షణం శ్రద్ధ చెయ్యండి.

స్వామి : ఆ పల్లపుదొడ్డిలో కాలవను చేరున్న మూడెకరాల ప్రతి మావాళ్ళుకావాలంటున్నారు. ఎంతచెప్పమంటారు?

మహా : అది మా మామగారి తాత,తండ్రులనాటినుంచి ఉన్న చేను. అదొచ్చినదగ్గరనుంచే ఈ యింటి ఐశ్వర్యం అంతా అని మా అత్తగారు మాటిమాటికి అనేది. అంతేగాకుండా దానికి అన్ని అంగులూ ఉన్నాయి. ముందే అది అమ్మడమా...

వెంక : ప్రయత్నం చేస్తానమ్మా... వెళ్ళొస్తా.

(వెంకటేశ్వర్లు వెడతాడు.)

స్వామి : అమ్మా! భూమి ఎవరిపేరవుందో వారు వ్రాలుచేసి రశీదు యివ్వనిదే రైతులు మగతాలు పొయ్యమంటున్నారు.

మహా : మూజువాణీ కవుళ్లు అయినప్పుడు రశీదులు అవసరం ఏముంది ?

స్వామి : ఏమోనండి... భూములు తమ స్వాధీనంలోనే వున్నాయని ఋజువు చేసుకోడానికి అలా ఏడుస్తున్నారు. 'కావలిస్తే దావాచేసుకోండి. కోర్టులో కడతామ'ంటున్నారు.

మహా : బాగానేవుంది. అంతవరకూ వచ్చిందన్నమాట.

స్వామి : ఈ రైతుసంఘాలు, కూలీసంఘాలు గొడవలొచ్చేకే యివన్నీ వచ్చేయి. నిన్న మీటింగులో మాట్లాడిన ఆయన నీరు, గాలిలాగే భూమి కూడా అందరిది అనేసరికి ఓ చప్పట్లు.........

(లక్ష్మీపతి ప్రవేశం)

మహా : ఏం తమ్ముడూ! ఏమిటో భూమి బిల్లులు వల్లకాడునట వింటున్నావా ?

లక్ష్మీపతి : వింటూనేవున్నా... అన్నిగొడవల్లాగే అవీ ఏడుస్తున్నాయి.

మహా : ఇప్పుడు ఏమిజరుగుతుందనుకుంటున్నారు?

ల : జరగందిలేదు, ఏడిసిందిలేదు ఏవో భ్రమలెట్టుకొని అలా ఏడుస్తున్నారు.

మహా : అలా అనకు నాయనా! ముందే జాగ్రత్త పడకపోతే, గోళ్ళతో గిల్లితే పోయేది గొడ్డలితో నరకాల్సిన స్థితికి వస్తుంది. వెంకటేశ్వర్లుగారితో చెప్పేను. నీవుకూడా ఆ దూరం, దూరంగా ఉన్న ప్రతులు అమ్మకానికి ప్రయత్నం చెయ్యి.

ల : నేనూ యీమధ్య ఆప్రయత్నంలోనేవున్నాను. కానేవాళ్లు తెగించి ముందుకు రావడంలేదు. వచ్చినవాళ్ళయినా బాగా తగ్గించి అడుగుతున్నారు.

మహా : అసలుకే మోసం వచ్చేటప్పుడు ఏదోకాడికి డబ్బు చేసుకోవడం మంచిదిగదా!

స్వామి : ముగ్గురు, నలుగురు కావలసినవాళ్ళున్నారు. తీసుకు రమ్మంటారా ?

మహా : తీసుకురా......

తమ్ముడూ! నువ్వు కొంచెం గట్టిగా శ్రద్ధచెయ్యి.

(తెర)

"పరులు అజ్ఞాపించే లేక శిక్షించే పరిస్థితులు రాకుండానే స్వయంశిక్షణ, త్యాగంద్వారా స్వార్థాన్ని లొంగతీసుకొని తన్నుతాను అదుపాజ్ఞలలో పెట్టుకోవడం ఉత్తమోత్తమం"

—'మహవీర్'

# దత్తపుత్రశోకము

## ౭వ రంగం.

[లక్ష్మీపతిగారి ఇంటి వసారా—కనకమ్మ కాఫీ తాగుతూవుంటుంది — బాబా సుభాషితాలు అనే పుస్తకం చేతపట్టుకొని గోపాలం ప్రవేశిస్తాడు.]

కనకమ్మ. ఏం బాబూ! ప్రొద్దున్నే వచ్చేవు?

గోపాలం: నిన్న మీటింగుకు తీసుకువెళ్ళిన సామాన్లన్నీ చేరాయా? చెల్లిఏది?

క: ఇప్పుడే స్నానంచేసింది: లోపల తలదువ్వుకుంటున్నట్లుంది. రమణా!... గోపాలంఅన్నయ్య వచ్చేడే...

(రమణ ప్రవేశం—ఆభరణాలన్నీ తీసివేసి తెల్లని చీర, తెల్లని జాకెట్టు మాత్రం ధరించి వుంటుంది.)

క: (ఆశ్చర్యంతో) అదేమిటే ?..

గోపాలం: మార్పు... మీటింగు మహాత్మ్యం.

రమణ: తప్పేముందమ్మ. కణ్వమహర్షి ఆశ్రమంలోనున్న శకుంతల కన్న సౌందర్య మెవరికివుంది. అన్నయ్యా! ఆ పుస్తకం ఏమిటి?

గోపాలం: బాబా సుభాషితాలు. వినోబాజీ బోధిస్తున్న విషయాలు తెలిపే పుస్తకం.

ర: నాకోసారి ఇయ్యి. చదివిస్తా.

గోపాలం: చదువులమ్మా. (పుస్తకం యిస్తాడు.)

క: అడవులలో వుండేవాళ్ళు ఎలావున్నా పోతుందిగాని మన లాంటివాళ్ళు యిలాచేస్తే అంతా నవ్వరా ?

గోపాలం: చెల్లీ! నీవున్నది లక్ష్మీపురంలో...... లక్ష్మీపతిగారి కూతురుగా... మహాలక్ష్మమ్మగారి కోడలుగా...

ర: అందుకు శిక్షగా యీభారం మోస్తూ ఉండడమా ?

గోపాలం: శిక్షఅనుకో, మకోటిఅనుకో అది ఇంతవరకూ ఇక్కడవున్న పద్ధతి.

క: లేనివాళ్ళు లేక బాధపడుతుంటే, నీవు ఉన్నవి పెట్టుకో కుండా తీసివేయడమేమిటి ?

ర: ఉందని అవసరం లేకపోయినా కడుపుకుతిన్నా, ఒంటిమీద పెట్టుకున్నా, కలిగేది బాధా ? సుఖమా ?

గోపాలం: అక్కర్లేనిదితింటే అజీర్తిరోగం. ఇక నగలవల్ల సంపా దించేటప్పుడు—పెట్టుకున్నప్పుడు — దాచుకున్నప్పుడు తాపత్రయం, భయం, బెంగ వగైరా కావాలసినన్ని.

క: చాలు, చాలు మంచిచీరలన్నీ వదలిపెట్టి ఆనూలుగుడ్డేమిటి?

ర: అమ్మా! నాకిక ఎప్పుడూ నగలువద్దు. విలువైన బట్టలూ వద్దు. సాదా నూలుబట్టలు చాలు.

క: ఏమంత పెద్దదానివయ్యేవని నీకీవైరాగ్యం ?

ర: మంచికి పెద్దేమిటి? చిన్నేమిటి? మంచిఅని తోచింది వెంటనే ఆచరణలో పెట్టాలిగాని.

అన్నయ్యా! ఆవీధి నరసయ్యగారి కోడలు సుభద్రను మన యింటికి ఒకసారి రమ్మంటే వస్తుందా ?

గోపాలం: రమ్మని చెప్పమంటావా ?

ర: వస్తానంటే సింహాచలాన్ని పంపుతాను.

గోపాలం: ఎందుకు అక్కర్లేదు. చెబితే ఆవిడేవస్తుంది.

(గోపాలం వెడతాడు.)

ర: అమ్మా! నిన్న సాయంకాలం మీటింగులో ఆయన ఆస్తి గురించి చెప్పినదానిగురించి ఏమంటావు ?

క: ఏమిటో అలాచెబుతారుగాని, దరిద్రులను బాగుచెయ్యడం అదృష్టవంతులను చెడగొట్టడం ఎవరితరం ?

ర: అమ్మా నీదృష్టిలో పెద్దపెద్ద ఆస్తులు కలిగిఉన్నవాళ్ళేగా అదృష్టవంతులు ? అయితే ఇప్పుడు వాళ్ళు అనుభవిస్తున్నది ఏమిటి ?

క: అవన్నీ వుంటేనే అదృష్టం. డబ్బుఉంటే ఏమికావలిస్తే అదే వస్తుంది.

ర: సుఖంతప్ప. అది డబ్బుకుదొరికే సరుకు కాదు. సుఖానికి ధనానికి ఎడముఖం, పెడముఖం. పోనీ ఆరోగ్యము మాత్రం... డబ్బున్నవాళ్ళలో నూటికి ఎందరు ఆరోగ్యవంతులున్నారు. పేద, సాదా ప్రజల్లో నూటికి ఎందరు ఆరోగ్యవంతులున్నారు ?

క: ఎండలో, గాలిలో ఒళ్ళువంచి పనిచేసే కూలీలకు, రైతులకు ఉండే ఆరోగ్యం ఒళ్ళు అలవకుండా కూర్చుని కాలం గడిపే ధనవంతుల కెక్కడవస్తుందమ్మా ?

ర: పోనీ ధనవంతులు కూడా వళ్లు వంచి పనిచేయ కూడదా ? దోమలు బోదజ్వరాలను, ఈగలు కలరాను, ఎలుకలు ప్లేగును తెచ్చిపెట్టేటట్లే, ధనం అనేక దీర్ఘవ్యాధుల్ని తెచ్చిపెట్టడానికీ కారణం అనే సంగతి తెలుసా అమ్మా ?

క: పనిచెయ్యడం దర్జాకు లోటుగాదా ?

ర: అవును. రోగాలతో మూలగడం దర్జాగాని, రోగాలు రాకుండా చెమటపట్టేలా పనిచెయ్యడమే! అందరూ కోరే సుఖంగాని, ఆరోగ్యంగాని డబ్బు కూడబెట్టడంవల్ల లభించనప్పుడు ఎందుకమ్మా అంతతాపత్రయం?

క: అది ఈనాడు మానవస్వభావం.

ర: అంతే మనం చేసే పనులు ఇలా ఆలోచించకుండా చేస్తాం. వానివల్ల వచ్చే అనర్థాలు అనుభవిస్తాం.

(కనకమ్మ లోనికి వెడుతుంది)

(బాబా సుభాషితాలు చూస్తూవుంటుంది)

(సుభద్ర బిడ్డను ఎత్తుకొని ప్రవేశిస్తుంది. ఆమె నిరాడంబరంగా, ఆరోగ్యంగా ఉంటుంది. ఆమె ముఖంలో చిఱునవ్వు తొణికిసలాడుతుంటుంది.)

రమణ: (పుస్తకం బల్లమీద పెట్టి లేచి ఎదురువెడుతుంది) రండి. రండి. (బిడ్డను తన చేతుల్లోకి తీసుకొని, ఎత్తుకు ముద్దాడుతుంది)

అలాకూర్చోండి.....బాబు పేరు ఏమిటి?

సుభద్ర: ఆనంద్........

(రమణ బీరువా తెరచి తన చిన్ననాటి ఆటవస్తువులను తీసి ఆనంద్‌కిచ్చి ఆ బిడ్డతో ఆడుతుంది)

రమణ: బాబు బువ్వతిన్నాడా?

సు: పెట్టి తీసుకువచ్చా.

(కనకమ్మ ప్రవేశిస్తుంది.)

క: అలా బిడ్డతో ఆడుకునే అదృష్టం మనకు పట్టలేదుగదా!

ర. చేసిన పనినిబట్టి ఫలితం వుంటుందిగాని, అన్యదా ఎందుకు వుంటుంది...... పోనీ యీ బాబును మనం ఉంచేసుకుందామా అమ్మా!

సు: (చిరునవ్వు నవ్వుతుంది)

క: అలాగే పెంచుదామమ్మా. అదేమిటో డబ్బున్న చోట పిల్లలు కరువు. పేదవాళ్ళకు పిల్లలు హెచ్చు.

ర: డబ్బుపోగుపడేసరికి బుద్ధిచెడిపోయి సోమరితనం, దురలవాట్లు పెరుగుతాయి. దానితో రోగాలువస్తాయి. అట్లాంటివాళ్ళకు పిల్లలు ఎట్లాకలుగుతారు? కలిగినా ఆరోగ్యంగా ఎట్లా వుంటారు? ఇక పేదవాళ్ళకా దురవ్యశనాలకు అవకాశాలు తక్కువగా వుంటాయి. అందుచే బిడ్డలు కలుగుతారు. సుఖంగా వుంటారు కూడా.

క: ఏమిటో... దేవుడు యివ్వాలిగాని...

ర: ఏం ముక్తొచ్చిన వేదాంతమమ్మా! కష్టపడి పంటలు పండించే ప్రజలను అన్యాయం చేసి, పోగుపెట్టేవారికి సొద్దుపకం కంటె అదృష్టం ఎందుకొస్తుందమ్మా!

(కనకమ్మ అసహనంగా మొత్తుకొని బయటకు వెడుతుంది.)

మీరు యిలా రావడంవల్ల మీ పనుల కేమీ ఆటంకము లేదుగదా ?

సు: ఫరవాలేదు. మా అత్తయ్య వంటపని చూస్తారు.

ర: శ్యామ్‌సుందర్ గారు మీ సొంతఅన్నయ్యేనా ?

సు: అన్నయ్యే.

ర: ఆయన ఎంతవరకూ చదువుకున్నారు? ఎక్కడవుంటున్నారు?

సు: రాజకీయాల్లో ప్రవేశించి, బి. ఏ. లోకి రావడంతోనే మాని వేశాడు. ప్రస్తుతం రాజవాడలో చాచాజీ ఆశ్రమంలో మకాం. ఇలాగే ప్రచారానికీ, ఇతర రాజకీయ గొడవలకు తిరుగుతుంటాడు.

ర: అవును... జ్ఞానులు స్వసుఖంకొరకు యింటివద్ద కూర్చుని కులాసాగా కాలం గడపలేరు ... వయస్సు ఏమంత పెద్దది కాకపోయినా మంచి అనుభవం సంపాదించేరు. విద్యా, బుద్ధులు రెండూ ఉన్నప్పుడే వ్యక్తి రాణించేది.

సు: వీలు చిక్కినప్పుడల్లా ఏవో చదవడం, చర్చించడం, వ్రాయడం చేస్తుంటాడు. ఎప్పుడూ ప్రజలు, ప్రజలంటూ ఉంటాడు. ఏదో ప్రజాసమస్య తీసుకు పనిచేస్తాడు.

ర: వారి కుటుంబం ఎంతవరు ? ఆస్తి ఎంతవుంది ?

సు: మా అన్నయ్య ఇంకా పెళ్ళిచేసుకోలేదు. అతను కోరేది, ఉన్నది ప్రధానంగా పుస్తకాలే. పోలీసు దాడుల్లో పోగా ఇంకా రెండు బీరువాలుంటాయి.

ర. జ్ఞానధనాన్ని మించిన ధనం ఏముంది? జ్ఞానికున్న సంతృప్తి, సుఖం ఇతరుల కెట్లుసాధ్యమవుతుంది ?

సు: అవునులెండి. ఈ వూళ్ళో పెద్ద పెద్ద ఆస్తులు కూడబెట్టిన వాళ్ల నందర్ని చూస్తే, నిజంగా జాలేస్తుంది. ఆస్తి, ఆస్తి అని రాత్రింబవళ్ళు తాపత్రయపడ్డం తప్పితే వారు అనుభవిస్తున్న సుఖం ఏముందిలెండి.

ర: ధనాన్ని పోగుపెట్టడానికి పడరాని పాట్లు పడతారు. అది పోగుపడ్డకొద్దీ, దాని వికారాల విశ్వరూపం ఏమనిచెప్పం.

సు: ఉపయోగంలేని ధనాన్ని కూడబెట్టడం. వ్యవసాయం చెయ్యని, చెయ్యలేనివారు భూమినికలిగి ఉండడం అన్యాయమే.

ర: అల్లాగని ఊహకునే మహానుభావులు ఈనాడు బహు అరుదు.

సు: ఆశకు అంతులేదు. ఆశఉంటే ప్రశాంతత ఉండదు.

ర: ఆశే, ఆడంబరాలు ఆవరించినవారికి ఆరోగ్యం, దీర్ఘాయుర్దాయం, ఆనందం గగనకుసుమాలు మాత్రమే.

సు: బిడ్డల విద్యాబుద్ధులకై శ్రద్ధచెయ్యక, పెద్ద పెద్ద ఆస్తులు కూడబెట్టి యిచ్చిన మంచికన్న చెడుఫలితాలే కలుగుతుంటాయి.

ర: జ్ఞానధనం స్వయంగా కృషిచేసి ఆర్జించవలసిన ఆస్తి. ఆ ఆర్జనలో వ్యక్తిమనోవికాశాన్ని పొందుతాడు. అందుచే సర్వసాధారణంగా ఒడుదుడుకుల కవకాశం ఉండదు. ఇక భూములు, డబ్బు వగైరా అన్నారా అది కన్నవారిచ్చినా యివ్వవచ్చు. దత్తత చేసుకున్నవారిచ్చినా యివ్వొచ్చు. లేకున్న ఏలాటరీలో వచ్చినా రావచ్చు. అట్టివారికి దాని అసలు విలువ ఎట్లు తెలుస్తుంది?

సు: వారి దృష్టిలో వాటివిలువ కాగితాలమీద అంకెలే. బ్యాంకిల్లోను, ఇనప్పెట్టెల్లోను నిలవే. మానవాభ్యుదయానికి వినియోగంగాదు.

ర: మీరేమి చదువుకున్నారు ?...

సు: 'థర్డుఫారమ్'. ఇంతట్లో పెండ్లిఅయింది, అత్తవారు అంగీకరించనందున స్కూలు మానివేయవలసివచ్చింది.

ర: మీకు తీరిక ఏఏవేళలలో వుంటుంది ? ఆకాలములో ఏమి చేస్తుంటారు ?

సు : మధ్యాహ్నం భోజనాలు అయింది లగాయితు సాయం కాలం వంట ప్రారంభించేవరకు తీరికే. అప్పుడు, రాత్రి కొద్దిసేపు చదువుతుంటా. మా అన్నయ్య తెలుగుపుస్తకా లన్నీ నాదగ్గరే వున్నాయి. నేనువెళ్ళినా, ఆతనువచ్చినా, మా అన్న నాకు యిచ్చే బహుమతులు పుస్తకాలు, పత్రికలే.

ర : అంతకన్న ఏంకావాలి. అన్నిటికి ఆధారభూతములైనవి అవే...... మీ తీరికసమయంలో అప్పుడప్పుడు ఇక్క డికి రాగలరా ?

సు : మధ్యాహ్నపువేళ రాగలను... మీరెంతవరకు చదివేరు?

ర : లక్ష్మీపురం నిజంగా లక్ష్మికి నిలయం. కాని సరస్వతి యిచ్చట స్థానం ఏర్పాటుచేసుకోలేకపోయింది. వందల కొద్దీ ఎకరాల భూమి, లక్షలాది వడ్డీ వ్యాపారం వున్న వారు కొప్పూళ్ళో ముప్పై మంది పైగా వుంటారు. అయినా వూళ్లో హైస్కూలు పెట్టించడానికి ప్రయత్నం చెయ్యలేదు. అందుచే ఐదోక్లాసుతో నాస్కూలు చదువు ఆఖరయిపోయింది. ఇంటివద్దే హిందీ, పంచకావ్యాలు, రెండేళ్లపాటు చదివేను. మీ దగ్గరవున్న పుస్తకాలు చదివి యిచ్చుటకు పంపిస్తూ ఉంటారా ?

సు : తప్పక... ఏమేమి పుస్తకాలు పంపించమంటారు ?

ర : ముందు చదవవలసినవి ఏవో అవి పంపించండి.

సు : కోటేశ్వరరావుగారు ఏమిచదువుకున్నారు ?

ర. మహాలక్ష్మమ్మగారు దస్తత చేసుకుంటేగాని, సరస్వతీదేవి ఆయనవంక చూడలేదు. చిన్నప్పటినుంచి ఒకటే ఘోరం.

సు: మీరు పత్రికలేమైనా చూస్తుంటారా?

ర: మానాన్న తెలుగు దినపత్రిక ఒకటి ఈమధ్యనే తెప్పిస్తున్నారు. అదే చూస్తుంటా.

సు: మరోనాడు వస్తా. పిల్లవాడు గొడవచేస్తున్నాడు. వెళతాను. పుస్తకాలకైతే ఎవరైనా పంపిస్తారా?

ర: వీలున్నప్పుడు మీరు, ఆనంద్ తప్పక వస్తూఉండండి...

(రమణ ఆనంద్‌ను ఎత్తుకు ముద్దాడి ఆటవస్తువులు సంచిలో వేసి యిస్తుంది, బిడ్డను తీసుకొని సుభద్ర వెడుతుంది)

(తెర.)

"వివిధములైన ఆచారములను అవలంభించేవారందరికీ సంఘం శరీరం వంటిది. సంఘంలో వున్న వ్యక్తులు సంఘానికి అవయవముల వంటివారు. సంఘానికీ, వ్యక్తులకు వుండే సంబంధం అంగాంగీ సంబంధం. శరీరానికి అవయవం ఉపకృతి చేసినట్టుగానే. సంఘానికి ఉపకారంచేసే—సంఘాభ్యున్నతికి పాటుపడే సాంఘికుడు విజయం పొందుతున్నాడు. తన మనశ్శుద్ధికై వ్యక్తి శాంతిని సాధించవలసి వుంటుంది. సంఘాభ్యున్నతికై శక్తిని పొందవలసి వుంటుంది. శక్తి ద్వారా సంఘాన్ని అభివృద్ధిచేసి, అనంతరం సాంఘిక వ్యవస్థలో శాంతిని నెలకొల్పాలి. సమభావంతో మెలగుతూ, తద్వారా సౌభ్రాతృత్వం పెంపొందించుకోడమే సంఘంలోని వ్యక్తులందరికీ పరమ లక్ష్యం కావాలి. తమలో తాము అన్నదమ్ములుగ మెలిగినప్పుడే మానవు లందరికీ శాంతి కలుగుతుంది. అప్పుడే పృథ్వి అంతా ఏక కుటుంబంవలె ప్రకాశిస్తుంది."

—రమణ మహర్షి

# దత్తపుత్రశోకము

## ౮ వ రంగం.

(మహాలక్ష్మమ్మగారి యింటివద్ద—హాలులో పెద్ద పేముకుర్చీలో కోటేశ్వర్రావు కూర్చుని వుంటాడు — పేట పెద్దలు, గోపాలం, మరికొందరు గుమ్మందగ్గరకు త్రోసుకు వస్తూవుంటారు — వెంకటేశ్వర్లు, స్వామి ఎదురుగా నిలబడి సర్దుతూ వుంటారు.)

గోపాలం: ఏమిటీదారుణం?...

పేట పెద్ద: దీని అంతు కనుక్కు—తీరాల్సిందే.

కోటేశ్వర్రావు: (ఇంకా నిషా వదల్లేదు. గుమ్మందగ్గరకు వస్తాడు.) ఏమిటిరా మీరు కనుక్కు—నేది...'గెటవుట్'...

గోపాలం: నువ్వు చేసిందానికి సరైన సమాధానం కూడా చెప్పవా?

కో: నే చెప్పను...మీ దిక్కు—న్నచోట ఫిర్యాదుచేసుకోండి.

వెంక: నాయనా! మీరు కాస్త శాంతించండి. పెద్దలు మహాలక్ష్మమ్మగారున్నారు.

స్వామి: కోటేశ్వర్రావుబాబూ! మీరు లోనికి పదండి.

(కోటేశ్వర్రావును లోనికి పంపివేసి, అతలుపు దగ్గరగావేసి స్వామి, వెంకటేశ్వర్లు పేట పెద్దల్ని, గోపాలాన్ని వేరొక త్రోవను, మహాలక్ష్మమ్మగారి మంచంవున్న వసారాలోనికి తీసుకువెడతారు.)

(అంతవరకు అత్తకు సేవచేస్తున్న రమణ జనాన్ని చూచి ప్రక్క—గదిలోనికి వెడుతుంది.)

మహా: బాబూ! ఏమిటీ గొడవ?

వెంక : అబ్బాయి కోటేశ్వర్రావిప్పు నీళ్ళకుండ ఎత్తుకు వస్తూన్న పార్వతిమీద కారు పెట్టేసేడట. కాస్సేపటికి ఆమె ప్రాణం పోయిందట.

మహా : రామ...రామ...ప్రొద్దున్నే ఎవరిముఖం చూచేడో ?

గోపాలం : సాని ముఖం చూచివుంటాడు. అతనికేమి? నెలలు నిండిన ఆమె ప్రాణాలు పోయేయిగాని.......

మహా : అయ్యో రామచంద్రా! పట్టిమనిషికూడా కాదా ?

గోపాలం : బ్రాంది బుడ్డి బిగించిన బాబుకు చాలింతాలేదు. చూలింతాలేదు.

మహా : అబ్బా... నారాయణమూర్తి ! ఎంతపనిచేసేవయ్యా ?

గోపాలం : నారాయణమూర్తి ఏంచేసేడూ... మీరు దత్తతు చేసుకొని యిచ్చిన డబ్బు చేస్తుందిగాని...

మహా : డబ్బు ఏమిచేసింది నాయనా?... ఎవరిలలాటాన్ని ఎలా వుందో అది ఎవరూ తప్పించలేరుగదా !

గోపాలం : అది మాలాంటి పేదవాళ్ల విషయంలో... డబ్బున్న వాళ్లకు డబ్బు చాలావాట్ని తప్పించివేస్తుంది. అదేగా మీలాంటివాళ్ళకున్న ధైర్యం.

మహా : నాయనలారా! ప్రమాదం ఎవరికైనా రావచ్చు.

గోపాలం : క్రింద నడచేవాళ్ళం మేము. కార్లల్లో తిరిగేవారు మీరు. ఆకువెళ్ళి ముల్లుమీదపడ్డా, ముల్లువెళ్ళి ఆకు మీదపడ్డా ఆకేపోతుంది.

మహా. అట్లా అనుకోకండి, మీరు మాత్రము నా బిడ్డలాంటి వాళ్లు కారా ?

గోపాలం: అల్లాగయితే... మాలాంటివాళ్ళ దగ్గర గూబలు పడెట్టి వసూలుచేసి, ఆ దత్తపుత్రుడికెందుకిస్తావమ్మా?

శంక: ఎందుకా గొడవలన్నీ, అసలువిషయం చూడక...

గోపాలం: పెళ్ళిఅయినా, శ్రార్ధమయినా మీకు అసలు విషయం ఒకటే. ఇప్పుడు మా అసలువిషయం వారి దార్జన్యాలనుంచి, మీ లిటిగేషన్‌నుంచి బయటపడడం...

శేట పెద్ద: ఊరుకోవయ్యా... నువ్వేమిటి...

గోపాలం: మీ బేరానికి నేను అడ్డుగావున్నానేమిటి ?

స్వామి: అబ్బ... ఊరుకో బాబు...

శంక: జరిగింది, జరిగిపోయింది... పోయిన ప్రాణాన్ని తిరిగి తీసుకురావడం పుట్టించినవాడితరం కూడా కాదు. మరి ఏమిచెయ్యమంటారో మీ వుద్దేశం చెప్పండి.

శే. పె: అసలు మీ అభిప్రాయం ఏమిటో సెలవివ్వండి.

శంక: ఏమమ్మా! మహాలక్ష్మమ్మగారు...మీ వుద్దేశం ఏమిటి?

మహా: అంతా మీకు ఒకటే....మీరే ఆలోచించి పరిష్కారం చెయ్యండి.

గోపాలం: ఆయనకు డబ్బుపట్లతప్ప, యితరత్రా రాగద్వేషాలు లేని మహానుభావుడు...దానిని సమర్పించగల సమర్ధులు మీరు.

మహా : ఎందుకు నాయనా! అలా అనుకోవడం....కోర్టులకు వాళ్లూ తిరగలేరు. ఏదోవిధంగా పొలిమేరలు దాటకుండా పరిష్కారం చేసుకోవడం మంచిదికాదా ?

పే. పె : సరేగానండి, మీా వుద్దేశం ఏమిటో చెప్పండి.

వెంక : పార్వతి భర్త ఉండడం అవసరమా ? వాళ్ళ కుటుంబం ఎందరు ?

పే. పె : వాడు రానక్కర్లేదు. వాడికి ఆరునెలలనుండి క్షయ జబ్బు. వాళ్ళ కుటుంబం వాడు, వాళ్ళమ్మ, ఇద్దరు పిల్లలు.

వెంక : మీారు కూడా బాగా ఆలోచించండి. ఆ కుటుంబానికి వెయ్యి. మీా దేవునికి మాటపదహార్లు తీసుకోవడం మంచిదని నా ఉద్దేశం.

ఒక పేట పెద్ద : దేవుడికి ఐదువందలకు దమ్మిడి తగ్గడానికి వీలు లేదు.

గోపాలం : పార్వతి, ఆమె కుటుంబం గొడవ మీాకెందుకులే. వెంకటేశ్వర్లువారికి, మీాదేవుడికి ములాగా ముట్టేటట్లు చూచుకోండి,

(కోటేశ్వర్రావు తూలుతూ అక్కడికి వస్తాడు.)

కో : పోయి మీా దిక్కున్నచోట ఫిర్యాదు చేసుకోమంటే, ఇంకా ఇక్కడే ఏడుస్తారెందుకు ?

(పౌరుషంతో పేట పెద్దలు, గోపాలం వెళ్ళిపోతారు.)

మహా : దాసూ! మా తమ్ముణ్ణి తక్షణం తీసుకురా.

కో. అత నెందుకు ?

మహా : చాలు. బాబూ చాలు. నిన్ను దత్తత చేసుకొని ఆస్తి అంతా వప్పగించినందుకు యింత సుఖపెడుతున్నావు.

స్వామి : ఎందుకమ్మా! ఇప్పుడు ఆయన్ని ఏమి అంటే ఏమి ప్రయోజనం ?

(విచారవదనంతో లక్ష్మీపతి ప్రవేశించును.)

మహా : తమ్ముడూ! గొడవ విన్నావా?

లక్ష్మీపతి : వినకే... అన్నీ వింటున్నా... విని తలవంచుకొని యింట్లో కూర్చుంటున్నా...

మహా : మనకర్మ...కోరి చెల్లెలు కొడుకుని దత్తత చేసుకొని నే నింత సుఖపడుతున్నా. కూతుర్నిచ్చినందుకు నీవు అనుభవిస్తున్నావు. లేక, లేక పుట్టిన పిల్లకి అమ్మపేరు పెట్టి, అష్ట బిడ్డల మంచరం కలసి ఆ చిట్టితల్లిని, యీ బాబుగాడికి పెళ్ళిచేసి, దాని జీవితాన్ని భ్రష్టుచేసేము. ఇవన్నీ చూచి ఏడవడానికే ఎన్ని రోగాలు వచ్చినా యింకా బ్రతికివున్నా.

స్వామి : మీరేమి చెయ్యగలరు ? అది దైవచిత్తం.

ల : దైవాన్ని అనుకోవడం మరోపాపం ... ఇది మా కర్మకు ప్రతిఫలం.

మహా : వెంకటేశ్వర్లుబాబూ! ఇప్పుడు ఏమిచేద్దామంటారు?

వెంక : పోలీసులకు రిపోర్టు వెళ్ళిపోయింది. ఎలాచూచినా యిది చిన్నవ్యవహారం గాదు. కాబట్టి డి. ఎస్, పి. వరకు వెళ్ళకమానదు.

మహా : అయితే ఏమి చెయ్యాల్సివుంటుంది.

వెంక : చిన్నవాళ్ళతో బేరాలు పెట్టుకోక, ముందే పెద్దవాళ్లను కట్టివేస్తే, వాళ్ళే అన్నీ చూచుకుంటారు.

మహా : సరే. అంతా మీకే తెలుసు. డబ్బుకు ఆలోచించకండి. అది నేనిచ్చుకుంటా. ఏదోవిధంగా కార్యం గట్టెక్కించడం మీవంతు. . .ఏంతమ్ముడూ! నీ ఉద్దేశం ఏమిటి ?

ల : కన్నకూతురుకు చేసిన ద్రోహాన్ని తలపెట్టుకొని, ఏడవడం తప్పితే నాకేవుద్దేశం లేదు.

మహా : బాబూ! ఎలాగువీలుంటే అలాగుచూడండి.

వెంక : కనీసం పాతిక వేలు అయినా పట్టుకు బయలుదేరడం మంచిది. లక్ష్మీపతిబాబూ! మీరు కూడా రావడం అవసరం. అచ్చట పరిస్థితులనుబట్టి, మనం సంప్రదించుకొని ఎలా వీలుంటే అలా చెయ్యవచ్చు.

ల : ఈ ప్రాయిశ్చిత్తము చాలు. ఏదో మాలక్కముఖంచూసి ఇక్కడకు రావడం తప్పితే, నాకు యీగొడవలేమీవద్దు.

మహా: బాబూ! అన్నీ మీకే తెలుసు... 15 వేలు పట్టుకొని మీరు, స్వామి, మా తమ్ముడు కారుమీదవెళ్ళి అన్నీ చూచుకురండి. అంతగా అవసరమైతే తరువాత ఆలోచిద్దాం...రమణా! ఈతాళాలు తీసుకువెళ్ళి ఆ పెట్టె అడుగు సొరుగులోనుండి 15 కట్టలు తీసుకొచ్చి, వెంకటేశ్వర్లుగారికియ్యి.

(రమణ వెళ్ళి, డబ్బు తెచ్చి యిస్తుంది—వెంకటేశ్వర్లు, స్వామి ఆ డబ్బు తీసుకు వెడతారు.)

శ: అక్కా! వెడతాను.

ర: అత్తయ్యా! మానాన్నతో నేనూ వెడతాను.

మ: (విచారంతో) మంచిది అమ్మా... (రమణవంక జూచి కళ్ళనీళ్లు పెడుతుంది.)

(తెర)

"నిండు నదులు పాఱు నిలిచి నిలిచి గంభీరమై
వెఱ్ఱివాఁగు పాఱు వేగఁబొర్లి
అల్పుఁ డాఁడురీతి నధికుండు నాడునా వి॥.

"గంగ పాఱునెపుడు కదల నిగతితోడ
ముఱికి వాఁగు పాఱు మ్రోఁతతోడఁ
పెద్ద పిన్న తరము పేరిమి యీలాగు వి॥

—వేమన యోగి.

# దత్తపుత్రశోకము

## ౯వ రంగం.

[సర్వోదయ కేంద్రము — తెల్లవారుఝామున ౫ గంటలకు చాచాజీ ప్రాణాయామం చేసుకుంటూ ఉంటారు— ఆశ్రమం గేటువద్ద రమణ]

రమణ: చాచాజీ!....చాచాజీ!

చాచాజీ: ఎవరు వారు?

ర: మాది లక్ష్మీపురము. నన్ను రమణమ్మ అంటారు. శ్యామ సుందర్ గారి చెల్లెలు సుభద్ర స్నేహితురాలిని.

చా. లోనికి రండి.......

(రమణ లోనికి ప్రవేశించును)

ర: నమస్తే చాచాజీ.

చా: నమస్తే. అదిగో నీళ్ళు, కాళ్ళు కడుక్కో అమ్మా!

(కడుక్కొంటుంది)

ర: శ్యామసుందర్ గారు ఊళ్ళో ఉన్నారా?

చా: ఉన్నారు. ఆసనాలు వేసుకుంటున్నారు. పిలవనా?

ర: వారి అభ్యాసాన్ని విఘ్నం చేయడమవుతుందేమో...

చా: ఫరవాలేదు. పిలుస్తాను. మీరు కూర్చోండి.

(చాచాజీ వెళ్ళి శ్యామసుందర్‌ను వెంటపెట్టుకు వస్తారు)

ర: నమస్తే.

శ్యామ్: నమస్తే.

చా: ఎంతసేపు అట్లా నిలబడడం? ఆ పీటమీద కూర్చో అమ్మా!

ర: ఫరవాలేదు చాచాజీ.

చా : మీరుభయులు ఒకరినొకరు యిదివరలోనే ఎరుగుదురా?

శ్యామ్ : చూడడం ఇప్పుడే. మా సుభద్ర వీరినిగురించిచెబుతూ ఉంటుది.

ర : మావ్వారు మీటింగులో ఉపన్యసిస్తూ ఉండగా మా మేడ మీదనుంచి చూచేను. సుభద్రనుంచి వారిని గురించి విన్నాను. అయితే సుభద్ర నాగురించి ఏమనిచెప్పింది ?

శ్యామ్ : మీకు అభ్యుదయ భావాలున్నాయని, అభ్యుదయ సాహిత్యం చదువుతూ వుంటారని...

ర : అంతకన్న మరేమీ చెప్పలేదా ?

శ్యామ్ : అంతే...

ర : అవును. నా మానసిక వేదనను నేను చెప్పివుంటేగదూ... ఆమెకేగాదు, ఇంతవరకూ ఎవరికీ నా జీవిత బాధల గాథ చెప్పలేదు. ఆర్చా, తీర్చనివారికి చెప్పిన ప్రయోజన మేమిటి ? ఇన్నాళ్ళు నాలో నేనే క్రిందా, మీదా పడుతున్నా......

శ్యామ్ : మీరు ఒంటరిగానే వచ్చేరా ?

ర : ఒంటిరిగా ఉండలేకనే వచ్చితిని.

శ్యామ్ : మీతలిదండ్రులకైనా మీరిట్లా వస్తున్నట్లు తెలుసా ?

ర : నేను బయలుదేరుసరికి తెలియదు.

శ్యామ్: స్వంతకారులల్లో బంధు, మిత్రపరివారంతో తప్ప బయటకు రాని మీరు యిట్లు ఒంటరిగా రిక్షాపై రావడానికి కారణం ఏమిటి ?

ర: ఇంటిదగ్గరనుండి రిక్షామీద రాలేదు. ఇల్లువదలి మూడు మైళ్లు నడచిన తరువాత, తిరుగు రిక్షా ఒకటి వస్తుంటే దానిపై వచ్చితిని.

శ్యామ్: అంత రాత్రివేళ ఒంటరిగా నడచిరావలసినంత అగత్యం ఏమి వచ్చింది ?

ర: నా జీవితం గురించి మీతో చెప్పుకోవాలని.

శ్యామ్: మీ జీవితానికేమి ?

ర: అవును నా మేడిపండు జీవితాన్ని చూచి, ఏలోటు లేనట్లు భ్రమపడడం సహజమే.

చా: అమ్మా! ఒంట్లో బాగులేదా ? మాట్లాడుతుంటేనే ఆయాసం వస్తుంది.

ర: బాగులేదు చాచాజీ! నరములబలహీనత, గుండెజబ్బుతో రెండేళ్ళనుంచి బాధపడుతున్నా అసలు మనస్సు బాగులేనప్పుడు రోగాలకు కొదవేమిటి ?

చా. మందేమైనా వాడుతున్నారా ?

ర: మందులు వాడి, వాడి విసిగిపోయేను. ఎందరో డాక్టర్లు, ఎన్నో మందులు...అయినా రోగం కుదరలేదు. బాధలు తీరలేదు. అందుచే ఇక డాక్టర్లు, ఔషధాలువల్ల నాకు స్వస్థత లభిస్తుందనే భ్రమలేదు చాచాజీ!

చా: కోసి తేనె వేసిన నారింజరసం కొంచెము తీసుకుంటారా? కాస్త అలసటతీరుతుంది. ఆ తరువాత మాట్లాడవచ్చు.

ర: ఇవ్వండి...... (చాచాజీ రసం యిస్తారు రమణ తీసుకుంటుంది)

చా: కాస్సేపు విశ్రాంతి తీసుకుంటారా?

ర: అక్కర్లేదు మీకేమైనా పనివుందా?

శ్యామ్: మా పనుల కేమీ తొందరలేదు. మీరు వచ్చిన విషయం మాట్లాడిన తరువాతనే అవి చేసుకోవచ్చు.

ర: సిద్ధాంతప్రబోధంతో పాటు, అవసరమైనచోట వాటిని మీరు ఆచరణలో పెట్టుటకు ప్రూనుకుంటారా?

శ్యామ్: ఆచరణలేని సిద్ధాంతం గొడ్రాలువంటిది. సిద్ధాంతము లేని ఆచరణ గుడ్డివానివంటిది. రెండూ కలిగియున్నప్పుడే ఆశయం సిద్ధించేది.

అయితే మీ సిద్ధాంతాన్ని, నా పరిస్థితులకు వర్తింపజేసి పరిష్కార మార్గం చూపుతారా?

శ్యామ్: అదేమీ అసాధ్యవిషయంకాదే......

ర: ఆ సూచనలను అమలుపర్చుటలో వచ్చే ఆటంకాలను ఎదుర్కొనుటకు సహకరిస్తారా ?

చా: అదికూడ మాపనేగదా...

ర: చాచాజీ! నేను గమనిస్తున్నది మానవ జీవితము అనుట కన్న పంజరంలోని చిలుకజీవితం అంటే బాగుంటుంది.

శ్యామ్: సకలైశ్వర్యాలు పుట్టింట, అత్తింట కలిగి యుండగా మీ కేమిలోటు ?

ర: మితిమీరినధనం చేయించే మతిమాలిన పనులవల్ల వచ్చే అనర్థాలు మీకు నేను వేరే చెప్పాలా ?......
ఎవరో వచ్చేరు చూడండి చాచాజీ !

చా: అచ్ఛా...ఇచ్చట చికిత్సపొందేవారు.

ర: ఇచ్చట చికిత్స ఏమిటి ?

శ్యామ్: చాచాజీ ప్రకృతి పద్ధతులలో చికిత్స చేస్తారు.

ర: చాచాజీ! అయితే ముందు మీరు అ పని చూడండి.

(చాచాజీ వెడతారు)

ర: మీ ఆసనాల అభ్యాసానికి ఆలస్యమవుతుందేమో? అసలు అవి ఎందుగురించి వేస్తారు ?

శ్యామ్: యోగవ్యాయామం అన్నివ్యాయామాలలోకి ఉత్తమ మైనది. శారీరిక, మానసిక ఆరోగ్యాన్ని కోరే ప్రతి ఒక్కరూ కోరుట మంచిది.

ర: బయిటకు వెళ్ళకుండా బందీలుగాఉన్న మా జోటివాళ్ళకు ఇవి ఉపయోగిస్తవా ?

శ్యామ్: చాలా బాగా ఉపయోగపడతవి. సాత్వికాహారం, మితంగా తీసుకుంటూ మొదట సూర్యనమస్కారాలు చెయ్యండి.

ర: అవి ఎట్లు చెయ్యాలి ?

శ్యామ్: మా సుభద్రవద్ద సూర్యనమస్కార యోగవ్యాయామ పటముంది ? అది తీసుకొని, దానిప్రకారం చెయ్యండి.

ర: ఈ ఆశ్రమం నెలకొల్పి ఎన్నాళ్ళయింది ?

శ్యామ్: మొన్న జరిగిన సర్వోదయ సమ్మేళన తరువాత......

ర. అంతకుపూర్వం చాచాజీ ఎక్కడ ఉండేవారు.

శ్యామ్: సేవాగ్రామ్ లోని గాంధీజీ ఆశ్రమంలో.

ర: ప్రస్తుతం యిచ్చట ఎందరున్నారు ?

శ్యామ్: నేను, చాచాజీగాక మరి ముగ్గురు యీ కేంద్రానికి సంబంధించిన పని చూస్తున్నాము. మిగిలిన కార్యకర్తలు తమ తమ తావులలో పని చేస్తూ అవసరమైనపుడు యిచ్చటికి వచ్చి, పోతూ వుంటారు.

ర : మీరూ వారు మొదట్లో వేరువేరు పార్టీలకు సంబంధించిన వారుగదా, యిప్పుడు కలసి ఎటుల పనిచేయ గలుగు తున్నారు ?

శ్యామ్ : ఉభయుల ఆశయం మానవాభ్యుదయమేగదా ! అటు వంటప్పుడు ఆశయ సాధనకు ఏది ఎప్పుడు అనుకూల మైన ఉత్తమ మార్గమో నిర్ణయించుకొని, అటుల ఉభ యులు కలసి పనిచేయుటకు అభ్యంతర మేముంటుంది ?

ర : లేనిమాట వాస్తవమే. కాని నేటి రాజకీయ పార్టీల కాట్లాటలన్నీ ఎందుకు ?

శ్యామ్ : నాయకుల అధికారం కొరకు...తాము అధిపతులం కావాలనే స్వార్థచింతతో ఏకీభవించిన వాటి గురించి అయినా కలసి పనిచేయక విభేదాలున్న విషయాలపై వ్యర్థవాగ్వాదాలు సాగిస్తూ ప్రజాసీకాన్ని గందరగోళ పరుస్తున్నారు. దేశానికి ద్రోహం చేస్తున్నారు.

ర : అయితే దీనికి పరిష్కార మార్గం లేదా ?

శ్యామ్ : నాయకుల స్వార్థంకొరకు వినియోగపడుచున్న నేటి పార్టీ నిరంకుశ యంత్రాలను మార్చాలి. ప్రస్తుతం పార్టీ బందిఖానాలలో నున్నవారు మొదట స్వేచ్ఛను

పొందాలి. జాతి, మత, కుల, పార్టీ విభేదాలకు స్వస్తి చెప్పాలి. ఆడంబరాలు, ప్రాంతీయ దురభిమానాలు వదలిపెట్టాలి. దుర్జనత్వానికి వ్యతిరేకంగా సజ్జనులంతా ఏకమై, ధర్మస్థాపనకై ఐక్యతతో కృషి చెయ్యాలి.

ర : బాబాజీ వచ్చేలోగా ఆశ్రమం అంతా చూడవచ్చా ?

శ్యామ్ : రండి... చూడండి.

(తెర)

---

"కర్మలేనిదే జ్ఞానము లభించదు, సర్వము త్యజించి స్వస్థతగా కూర్చుండు మనుష్యుడు సిద్ధపురుషుడు కాజాలడు. సోమరివలె కూర్చుండుటకంటె సేవాధర్మము శ్రేష్ఠమైనది. సోమరియై కూర్చుండువారి శరీరము తుదకు క్షీణించును. పనిచేయనివారు దేనిని అనుభవించ లేరు. ఈ నియమము సర్వజీవులకు వర్తించునపుడు మనుష్యుని విషయమున దీని ప్రాముఖ్యము వేరే చెప్పాలా ?"

(బాబాజీ గీతాబోధ)

# దత్తపుత్రశోకము

## ౧వ రంగం.

[రోజాకై కట్టించిన మేడలో — సాయంకాలం 'టీ టేబుల్ వద్ద — కోటేశ్వరావు ఎడమ చేతిని టేబుల్ పై ఆని చెయ్యి మడిటిపై పెట్టుకొని కూర్చుంటాడు. రోజా ఎదురుగా కూర్చుని వుంటుంది.]

రోజా: ఆ ఎలక్షన్ నామినేషన్ నాటినుండి వ్యాఘ్రేశ్వరావు గారు, కావాలు, మిరియాలు నూరుతున్నారు. ఆ కోర్టు జవాను ఉదయంనుంచి మూడు సార్లు వచ్చి, తిరిగి పోయేడు.

కో: విషయం అంతవరకు వచ్చిందా ?......

రోజా: నా కేమి తెలుసు......

కో: నీకు తెలియదు...పాపం!...ఏమీ తెలియదు ......
కాని నాకు తెలిసిందిలే, నీవు చేస్తున్న దేమిటో...

రోజా: నేనేమి తప్పు చేస్తున్నాను ?

కో: నీవు చేసింది, చేస్తూన్నది తెలుసు ... నీవు ఎవరి కేమి చెప్పేవో....నీవు ఎవరి చెప్పుచేతల్లో నడుస్తున్నావో కూడా తెలుసు.

రోజా: ఎందుకంత నిష్ఠూరంగా మాట్లాడతారు ?

కో: మాయలమారి ... ఇంత ద్రోహం తలపెడతా వనుకో లేదు.

శో॥జా : నేనా.... ద్రోహమా ?...అన్యాయం.

శో : ద్రోహి ! యింకా ఎన్నాళ్ళు నీ కుట్రలు సాయగలుగుదు ననుకుంటున్నావు...

శో॥జా : నేనేమి కుట్రలు చేసేను ?

శో. లేదా ?...(కోపోద్రేకంతో లేస్తాడు)

శో॥జా : కొడతారా ?

శో : కొట్టేరోజులు...పడే పరిస్థితులు యివికావు.

శో॥జా : ఎందుకంత క్రోధంగా మాట్లాడతారు. మీకు నేనేమి అపకారం చేసేను ?...

శో : నా జబ్బుగురించి వ్యాఘ్రేశ్వరావుకు చెప్పింది నీవు కాదా ?

శో॥జా : నేను చెపేనని ఎవరన్నారు ?

శో : ఎవరు అనాలి ? నా జబ్బు గురించి నాకు తెలును. నీకు తెలును. వైద్యం చేస్తున్న డాక్టర్ విశ్వేశ్వర్లుకి తెలుసు.

శో॥జా : మీకు యింకా ఎందరు స్నేహితురాండ్రు లేరు ! నిషాలో ఎవరితో ఏమి చెప్పేరో ?

శో : తిన్నయింటి వాసాలు లెక్క పెడతావా ? దత్తత చేసుకొని, ఆస్తి యిచ్చిన తల్లి రోగాలతో బాధ పడుతుంటే, దగ్గరకైనా వెళ్ళకుండా, పెండ్లి చేసుకున్న భార్య ముఖం అయినా చూడకుండా నీ దగ్గరకు చేరినం దుకు యింతపని చేస్తావా ?

కో॥జా : మీరు నన్నెక్కడ నమ్మివున్నారు ? మీకున్నవారిలో నేనొకర్తెను మాత్రమే.

కో : దరిద్రస్థితిలో పల్లెటూళ్లో పడివున్నదాన్ని తెచ్చి, ఇంత భోగాన్ని పెట్టినందుకు యీప్రతిఫలమా ? పెంచి, పోషించిన నాపట్ల ఇల్లా ప్రవర్తిస్తావా ?

కో॥జా : ఇష్టంలేకపోతే వదలివెయ్యండిగాని మాటలు అనవసరం.

కో : ఆమాట అంటావని......అనేశైము వచ్చిందని నాకు తెలుసు.

కో॥జా. అన్నీమీకు తెలిసిన తరువాత ఇక యీగొడవంతా ఎందుకు ?

(రంగడు ప్రవేశించును)

రంగ. కోర్టుజవాను ఏమో కాగితాలు పట్టుకువచ్చేడు కోటేశ్వర్రావుగారిని అడుగుతున్నాడు

కో॥జా : ఇంటిదగ్గర లేరనిచెప్పి, అలమారులోని రూపాయి వాళ్ల కిచ్చి పంపివెయ్యి.

(రంగడు వెడతాడు)

కో : ఘాతకురాలా ! వ్యాఘ్రేశ్వర్రావు నాకంటె ఆప్తుడయ్యేడా ? ఇద్దరు ఏకమై యింత ద్రోహంతలపెడతారా ?

రోజా : నేనేమీ తలపెట్టలేదు. నేనంత బరువనిపిస్తే నాతో ఉండ డం అంతబాధనిపిస్తే వదలివెయ్యండి.

కో : వదులుతా...వదిలే విధంగా వదులుతా...

(రోజా లోనికి వెడుతుంది)

... ... ....

(కోటేశ్వర్రావు పెట్టె తెరచి, చిన్నమందు సీసా తీసిపట్టుకుంటాడు___

వంటమనిషి ఫలహారం, టీ పట్టుకొచ్చి టేబుల్‌పై పెట్టి వెడుతుంది___

రోజా తిరిగివచ్చి యిదివరకటి చోటులోనే కూర్చుంటుంది)

కో : (వ్యధతో) నీవు...అమిత్రద్రోహి ఏకమై యింత ద్రోహం తలపెడతారా...రాజకీయ వ్యవహారాల్లో ప్రాభవంచేస్తారా...అవసరమని నటించి, అక్రమ అప్పులు సృష్టించి, ఒళ్లు తెలియకుండా ఉన్నప్పుడు మీయిష్టము వచ్చిన వాటిపై సంతకాలు పెట్టించుకొని, నేడు వాటికై వారంట్లువరకూ తీసుకువస్తారా...నాఅన్నవాళ్ల నందరిని నానా బాధలుపెట్టి నీచెట్ట పట్టినందుకు ఈవిధంగా వంచనచేస్తావా...నాకు చెడ్డరోజులు రాబట్టే...కష్టం వ్యాధి...కారుపరిమాధం...నిమిషంకూడా నిషాలేకుం

డా నిలవలేనిస్థితి వచ్చేయి...ఛీ...ఇన్నాళ్లు అంతదర్జాగా బ్రతికి, ఇక ఈకుళ్లుబ్రతుకు బ్రతకడమా...ఈవాడు బ్రతుకుని చూచి సంతోషించేదెవరు............ రోజా! ఇంతపనిచేస్తావని కలలోకూడా తలచలేదు. సరే, నీవు, నీవ్యాఘ్రేశ్వరావు హాయిగా బ్రతకండి......

... .... ...

(రోజా జేబురుమాలుతో తనకళ్లు ఒత్తుకుంటుంది)

... ... ...

(కోటేశ్వరావు చటాలున సీసా మూతతీసి మందు నోటిలో వేసు కోబోతాడు)

రోజా : అదేమిటి ?

కో : ఏమైతే నీకెందుకులే...

రోజా : ఆగండి...ఆగండి

(లేచి కోటేశ్వరావుగారి చెయ్యిపట్టుకోబోతుంది. రెండవచేతితో ఆమెను తోసివేసి, సీసాలోని మందు నోటిలో ఒంపుకుంటాడు)

రోజా : అయ్యో, అయ్యో, ఇదేమికర్మం.

(కోటేశ్వరావు కూలబడి గోసిస్తాడు)

రోజా : (కంగారుగా) రంగా! ...

రంగా! _ వేగంరారా

(రంగడు ప్రవేశిస్తాడు)

రంగ : ఏమక్కా ?

రోజా : కొంపమునిగింది నాయనా. ఆయన ఏదో తాగిపడి పోయేరు.

రంగ : మామూలు మందే మోతాదు ఎక్కువయిందేమో...

రోజా : కాదురా...ఏదో విషంలావుందిరా...

రంగ : విషమే...

రోజా : డాక్టరు విశ్వేశ్వర్లుగారింటికి పరుగెట్టి తక్షణం రమ్మని తీసుకురారా...

(రంగడు పరుగెత్తుకు వెడతాడు)

ఏమండి ! అయ్యో...ఏమండి ! నేనేమిచేసేను.

... ... ...

(రోజా గదిలోనుంచి బయటికీ, బయటినుంచి గదిలోకి తిరుగుతుంది)

... ... ... -

(డాక్టరు, రంగడు ప్రవేశిస్తారు)

రోజా : డాక్టరుబాబూ ! చూడండి. కోటేశ్వరావుగారు ఎలా కొంపతీసేరో.

(డాక్టరు కోటేశ్వరావును పరీక్షచేస్తుంటాడు)

రోజా : ఏది ఫరవాలేదుగదా! బాబూ !

డాక్టరు : ఇంకా చెప్పలేం...

(డాక్టరు మందునీసాకూడా పరిశీలిస్తాడు)

రోజా : అయ్యో...ఏం కర్మంవచ్చింది...బాబూ ! పెద్ద ఆసపత్రికిగాని తీసుకువెళ్లాలా ?

డాక్టర్ : వాళ్లుచేసినా. నేనుచేసినా ఆవిషాన్ని కక్కించాలి కంగారు పడితే ప్రయోజనంలేదు.

(డాక్టరు కోటేశ్వరావుకు మందు యిస్తాడు)

... ... ...

(కోటేశ్వరావు కక్కుతాడు)

రోజా : ఏంబాబూ ! ...

డాక్టర్ : బహుశా ప్రమాదం ఉండకపోవచ్చు.

రోజా : పోనీబాబూ...ఏమైనా జరిగితే ఆయన ఒక్కడితోటే వదులుతుందా ? ...

డాక్టర్ : కాస్సేపు అట్లాగేఉండనివ్వండి. 'ఫేన్' దగ్గర్లో పెట్టి ఉండండి.

(డాక్టర్ నిష్క్రమణ)

(తెర)

---

"మానవ స్వభావంలో క్రమ శిక్షణ లేకపోవడం సర్వసాధారణ విషయం. మనం ఇతరులను స్వాధీనపర్చుకోగలము గాని, మనం మనల్ని స్వాధీనం చేసుకోలేకపోతున్నాం. మనం ఇంద్రియములకు లోబడిపోయినాం. వాటి ప్రబోధములను కాదనజాలకపోతున్నాం ఇంద్రియములు ప్రకృతి దత్తములు, మనకు ఉపయోగకారులు కాని వానిని అదుపు ఆజ్ఞలలో పెట్టకపోతే, అంతకంటె శత్రువులు వేరేమిలేవు. మన అనారోగ్యానికి దుఃఖానికి కారణాలు ఇంద్రియలోలత్వముతప్ప మరేమి కాదు".

—శివానంద

# దత్తపుత్రశోకము

## ౧౧ వ రంగం.

[లక్ష్మీపతిగారియింటి దొడ్డిలో—కనకమ్మ ముఖం కడుక్కుంటూ ఉంటుంది—పనిమనిషి సింహాచలం వసారా ఊడుస్తూ ఉంటుంది.]

సింహాచలం : అమ్మా ! రాత్రి దొడ్డితలుపు గడియవెయ్యలేదే మండి.

కనకమ్మ : అమ్మాయి వేసిందే...మళ్లీ ఎవరు తీసేరు ?

సింహా : ఏమోనండి.

(లక్ష్మీపతి ప్రవేశం)

లక్ష్మీపతి : ఒసే ! అమ్మాయి ఎక్కడ ?...

కన : మొన్న మీతో వచ్చినదగ్గరనుండి అదోలావుంటూంది. నిన్న ఒంట్లో బాగులేదని భోజనం చెయ్యలేదు. ఇంకా లేవలేదులావుంది.

ల : పొద్దు పొడిచినా యింకాలేవకపోవడం ఏమిటి ? లేవు. ఒంట్లో బాగులేకపోతే డాక్టరుగారికి ఎందుకు కబురు చెయ్యలేదు.

(కనకమ్మ కూతురు పడకగదిలోనికి వెళ్లి చూచివస్తుంది)

క : పక్కమీదలేదు. దొడ్లోకి వెళ్లిందేమో...సింహాచలం ! అమ్మాయి ఆదొడ్లో వుందేమోచూడు.

సింహా : వీధి, పెరళ్లు, పైన క్రింద అన్నీ పోగుచేసేను. రమణమ్మగారు కనుపించలేదు అమ్మగారూ !

క : ఆ...ఎక్కడకు వెళ్లింది...చూసు మా ఆపసపచు గారిం
టికి వెళ్లిందేమో...ఎవరిని అడగక చూచిరా.

(సింహాచలం వెడుతుంది లక్ష్మీపతికంగారుగా నూతిదగ్గరకు వెళ్ళి చూచివస్తాడు)

ల : ఏమే ! తెల్లవారిన దగ్గరనుంచి అమ్మాయి అలనే లేకుండా పోయిందే ?

క : పరుపుమీద శాలువా ఉబ్బెత్తుగా వుంటే యింకా పడుకునే ఉందనుకున్నాను.

(సింహాచలం ప్రవేశిస్తుంది)

సింహా : అక్కడా లేదు అమ్మా !

ల : అయితే ఏమయినట్లు ? నువ్వుదానిని ఏమైనా అన్నావా ఏమిటి ?

క : నేనేమన్నాను, అదేమన్నా చిన్నపిల్లా తిట్టడానికీ, కొట్టడానికీ, పోనీ ఏమైనా అనడానికైనా రమణ తప్పులుచేసే తెలివితక్కువ పిల్లా ఏమిటి ?

ల : (ఆందోళనతో మెల్లాపై చలికలబడి) మరి ఎక్కడికి వెళ్లినట్లు ?

క : ఏమీపాలు పోవడంలేదు, ఈమధ్యదాని ధోరణి అంతా అదోలోవుంటోంది. నగలన్నీ తీసేసింది. నూలుబట్టలే కడుతూంది. మందులు మానేసింది. ఇరుగూ, పొరుగూవాళ్లతోగాని, నాతోగాని ముక్తసరిగా మాట్లాడి

ఊరుకుంటూంది. ఎట్లొచ్చి అనుభద్రవచ్చినా, గోపాలం వచ్చినా కాస్త కులాసాగా మాట్లాడుతూంది. రాత్రి పగలు ఏవో పుస్తకాలుచదువుతూ కూర్చుంటూంది. నిన్న సాయంకాలం ఆనుభద్ర తను చాలాసేపు మాట్లాడుకున్నారు.

ల : సింహాచలం ! పోయి ఆనుభద్రను ఒకసారి తొందరగా పిలుచుకురా.

(సింహాచలం వెడుతుంది)

క : ఆశకు అంతులేక ... దానినెత్తిని నిప్పులు పోయించేము. దాని బ్రతుకు అడివినగాచిన వెన్నెలయిపోయింది. ఆలోచనలేని మొద్దయితే ఎలాగో పడిఉండును. అన్నీ తెలిసిన నాచిట్టితల్లి ఎందుకు తెగించిందో.

ల : అసలు సంగతేమిటో తెలుసుకోకుండా నువ్వాల గోలేవిమిటి?

క : అదేమిటోగాని నిన్నరోజంతా దిగులుగావుంది. రాత్రి ఏమి ఆలోచించుకొందో ! తెల్లవారకముందే ఏమిబుద్ధి పుట్టి దీనికి సాహిసించిందో......

(సుభద్ర, సింహాచలం ప్రవేశిస్తారు)

క : సుభద్రా ! నిన్న సాయంకాలం నీవు మీారమణ ఏంమాట్లాడుకున్నారు ?

సుభద్ర : కారు ప్రమాదంలో మరణించిన పార్వతి గురించి చాలా బాధపడిందండి.

క : ఎక్కడికైనా వెడతానని ఏమైనా చెప్పిందా ?

సుభద్ర : లేదండి. మాఅన్నయ్య ఎక్కడవుంటాడని, వివరంగా తరచి, తరచి అడిగింది అంతే.

అ : అతను ఎక్కడ వుంటాడు ?

సు : ఎక్కడికి ప్రచారానికి వెళ్లినా తిరిగి రాజవాడలోని బాబాజీ ఆశ్రమానికి చేరుకుంటాడు.

అ : సింహాచలం ! వీధిలో డ్రైవరున్నాడు త్వరగాపిలు.
(సింహాచలం వెళ్లి డ్రైవరును వెంటబెట్టుకొస్తుంది)

అ : డ్రైవర్, కారు బయటకుతియ్యి, రాజవాడ వెళ్లిరావాలి
(డ్రైవరు వెడతాడు)

క : నేనూ వస్తానండి,

అ : నువ్వెందుకు ?

క : నాకిక్కడ ఏమితోస్తుంది. నేనిక్కడచేసే దేమున్నది ?

అ : అయితే త్వరగా బయలుదేరు.

క . సింహాచలం ! మేమువచ్చేవరకు ఎక్కడికి వెళ్లక యిక్కడే వుండు – ఎవరితోను రమణ మాట చెప్పకు. . .ఎక్కడికి వెళ్లేరని ఎవరైనా అడిగితే, రాజవాడ వెళ్లేమని, ఇప్పుడే వస్తామని చెప్పు.

సింహా : అలాగె అమ్మగారూ !

క : సుభద్రా ! నువ్వుకూడా ఎవరికిచెప్పకు.

సు : చెప్పనండి.

ల : రావే తొందరగా.

క : అన్నీ తీసుకున్నారా ?

ల : సరే...నడు, త్వరగా కారు ఎక్కు—

(తెర)

---

" భార్య భర్తయొక్క బానిసగాదు. సహచరిణి, సహధర్మ చారిణి సుఖ దుఃఖాలలో సమభాగ స్వామి తనమార్గాన్ని తాను ఎంచుకొనుటకు భర్తతో సమాన స్వేఛ్ఛ ఆమెకు కూడా కలదు. "

—గాంధీజీ,

# దత్తపుత్ర శోకము

## ౧౨వ రంగం.

[ సర్వోదయ కేంద్రములో — చాచాజీ, రమణ, శ్యామసుందర్ చాపలపై కూర్చుని ఉంటారు. ]

శ్యామ్ : మిమ్మల్ని వేదిస్తున్న విషయం ఏమిటి ?

ర : మానవ జీవితం గడపలేక పోతున్నానే అని...

శ్యామ్ : అదేమిటి ?

ర : మేధాశక్తిని వినియోగించి, సమాజ అభ్యుదయానికై కృషి చేయకున్న, పశుపక్ష్యాదులపై మానవునికున్న ఆధిక్యత ఏమిటి ?

చాచాజీ : అట్టి సదుద్దేశంతో శక్తివంచనలేకుండా పనిచేయుటే మానవధర్మం కాని నేడు అత్యధిక సంఖ్యాకులు స్వార్ధ బుద్ధితో పట్టుపురుగుల స్థితికి పతనమవుతున్నారు.

శ్యామ్ : నేడు ఆడంబరం అనే అంటువ్యాధి ప్రబలంగా వ్యాపించివుంది. తమ సుఖంకోసం సృష్టించుకున్న వాటికి తామే బానిసలై గమ్యాన్ని మర్చిపోతున్నారు.

ర : ధనధాన్యాదులు, వస్తువాహనాలు, దివ్యభవనాలు, భూఖండవలు ఆర్జించినవ్యక్తికిగాని, వారికుటుంబానికిగాని సుఖమని మీ అభిప్రాయమా ?

శ్యామ్ : తిండి, బట్ట, ధనం, ధాన్యం, వస్తు వాహనాలు కొంప గోడలు కొరకుకాదు మనంజీవించేది. శరీరానికి కనీస అవసరాలు కావాలి, కాని నిజమైన జీవితం అటుపై నే ప్రారంభమవుతుంది. అయినప్పటికి ఎంతోమంది మామూలు శరీరావసరాల కొరకే కాలాన్ని వృధావుచ్చుతున్నారు. మానవుడు ఉండడానికి స్థానంకావాలి అయితే దివ్యమందిరంకంటె మామూలు మట్టి గుడిసే మంచిది. ఎందుకంటే శరీరావసరాలకే కాలం వృధా అయిపోతే, ఇక మానసిక కర్తవ్యాలకే మాత్రం కాలం మిగులుతుంది ?

చాచాజీ : తాము చేసేపని లాభమా, నష్టమా — సుఖమా, దుఃఖమా — మంచా చెడ్డా అని ఆలోచించి చేసేవారు బహు అరుదు. అట్లు ఆలోచించి పనిచేయుట విజ్ఞుల లక్షణం. కాని నేడు దానిని గుర్తించక పరులను బాధించి విశేషంగా భాగ్యాన్ని కూడబెడుతున్నారు.

శ : పలువురు చేస్తున్నారు గదా అని, అటుల చేయుటధర్మమా?

చా : ఎన్నటికి కాదు. ఏదేశంలోను, ఏకాలంలోను ఏమహానీయులు అట్లు చేయలేదు. విషయ వాంఛలతో సంతృప్తి చెందమని చెప్పలేదు. నిరాడంబరతలో, నిష్కామబుద్ధితో, నిరంతర ప్రజాసేవ చెయ్యమనే బోధించేరు. వారటులచేసేరు.

శ్యామ్ : ప్రస్తుత సమాజంలో ఆశయానికి, ఆచరణకు — మాటలకు, చేతలకు తేడావుంది. దానివలన వ్యక్తిలోను, సంస్థలలోను ఏకత్వంపోయి, ద్వందత్వంవస్తోంది. ఈద్వందత్వాన్ని తొలగించి, ఏకత్వాన్ని సాధించడానికి మహాపురుషులు పూనుకున్నారు. వ్యక్తిగతంగా విజయం పొందేరు కూడాను. తత్ఫలితం నిజమైన సుఖం, సంతోషం, విశ్రాంతి పొందగలిగేరు. వారిలో మానసికబలం, ఆలోచనాశక్తి ఎక్కువగా ఉండడానికి కారణం. వారి ఆశయం, మనస్సు, వాక్కు, కర్మ అన్నీ ఒకటే.

ర : అటిసిలిటిని పొందుటకు ధనం కలిగియుండుట ప్రతి బంధకం కాదా ?

చా : జ్ఞానులైన జనకుడు, అశోకుడు వంటి వారికి కాకపోవచ్చును దాని, మామూలు వారికి అవసరానికిమించిన ధనం కలిగియుండుట, కలిగియున్నవారికి తోటివారికికూడ అనర్ధమనేది నిస్సందేహము.

ర : మనదేశానికే కాకుండా ఆసియాఖండాని కంతకు జ్ఞానబోధ చేసిన బుద్ధుడు రాజ్యాన్ని సకల ఐశ్వర్యాల్ని వీలత్యజించవలసివచ్చింది. మనపూజ్య బాపుజీ ప్రజాసేవకు పూనుకునే ముందు, తనకున్న ఐశ్వర్యాన్ని త్యజించి దరిద్రి నారాయణుడు ఏల కావలసివచ్చింది ? జ్ఞాననిధులైన మన మహాఋషులు, యోగులు, మునులు ధనానికి దూరంగా ఉండుటలోని అంతరార్ధం ఏమిటి ?

శ్యామ్ : మనదేశంలోనేగాదు. ప్రపంచ చరిత్రలో యింకను అనేక ఉదాహరణలున్నాయి ప్రఖ్యాత రష్యన్ రచయిత టాల్‌స్టాయి జ్ఞానోదయం కావడంతోనే తన ఆస్తి నంతటిని త్యజించేరు. జీసెస్ క్రైస్తు, రష్యా విప్లవనాయకుడు లెనిన్ వ్యక్తిస్వామ్యాన్ని నిరసించినవారే. మహమ్మదీయులుకూడా వ్యక్తి స్వార్థాన్ని గౌరవించరు. త్యాగాన్నే మన్నిస్తారు.

చాచాజీ : పరిత్యాగం అంటే ఆస్తి వదులు కోవడమేగాదు. తల్లి మాతృమయమైన బిడ్డ ప్రక్కపై పరుండి, తన బిడ్డపై నున్న ప్రేమకొద్ది, ఆమురికిని మరచి సంతోషాన్ని అనుభవిస్తుంది. మనంకోరేది అట్టి తల్లి త్యాగంవంటిది. పరుల ప్రేమించుటద్వారా ఎంతో సుఖాన్ని పొందవచ్చు. అటువంటి ఘటనలు ప్రతి ఒక్కరి జీవితంలోను వస్తూఉంటాయి. స్వార్థరహితుడైన కర్మ . యోగి. జీవితంలో అవి నిరంతరం వస్తుంటాయి. అందుచే అతడు అందరి హృదయాల్లోను స్థానం సంపాదించగలుగుతాడు. అట్టి వారికి 'నీ', 'నా' అను భేదాలుండవు. తద్వారా సుఖాన్ని పొందుతాడు. సంతోషంగా ఉండగలుగుతాడు.

శ్యామ్ : ధనవంతులు, తమ సంపదను సమాజంకోసం వినియోగిస్తే సమాజంవారిని గౌరవిస్తుంది. త్యాగదృష్టివల్ల పరస్పర ప్రేమ ఏర్పడుతుంది. త్యాగంచేయుట అలవర్చు

కోకపోతే భవిష్యత్ అంధకారమే. నేటి ఆటమ్, హైడ్రోజన్ బాంబుల పోటీ సమయంలో సామ్యవాయోగ సిద్ధాంతాల ననుసరించకున్న "అర్ధరాత్రికి ఇక కొద్ది నిమిషాలు మాత్రమే (సర్వనాశనానికి)

చాచాజీ : ప్రపంచ శాంతి మారణాయుధాలవల్లరాదు. పరస్పర సుహృద్భావ సౌమనస్యాలవల్ల మాత్రమే విశ్వశాంతి సాధ్యము. స్వార్థం యుద్ధానికి బాట అయితే త్యాగం శాంతికి త్రోవ. స్వార్థంయొక్క పరాకాష్టే 'కలి పురుషుడు'.

(బయట చాచాజీ ! చాచాజీ ! అనిపిలుపు)

ర : మానాన్న... (రమణలేచి బయటికి వెడుతుంది)

(లక్ష్మీపతి, కనకమ్మ ప్రవేశం)

ర : నాన్నా ! లోపలికిరండి. (కనకమ్మ కంట నీరుపెడుతుంది)

అమ్మా ! అదేమిటి ! లోనికిరా.

చా : లోనికి దయచెయ్యండి.

క : అమ్మా ! యింతపనిచేస్తావా ?

ర : నేనేమి తప్పు చెయ్యలేదే,

క : తల్లికి, తండ్రికి, అత్తకు, భర్తకు తెలియకుండా ఆడుది ఒంటరిగా యిల్లువదలి రావడంకన్న ఏమికావాలమ్మా ?

ల : ఎందుకిక...చెప్పుకుంటేసిగ్గు...ఇవన్నీ చూచి, ఏడ్వడమే మనబ్రతుకు.

ర : నాన్నా ! మీకు నేను ఏమి అపచారము చేసితిని ?

ల : నీవు ఏమియు చేయలేదు. మేము చేసుకున్న కర్మఫలితమే నీవు యిట్లు రావడం, వాడు సానియింట విషం త్రాగి చావడానికి సిద్ధపడటం.

చా : అదేమిటి ? ఈమె యిట్లు వచ్చినందుకేనా ?

ల : వచ్చినందుకుగాదు, వాడు, వాడి గొడవలువేరు.

ర : అమ్మా ! ఎందుకు అట్లా కన్నీళ్ళు పెడతావు. తోటకూర నాడేచెప్పకున్న వచ్చేపరిణామాలిట్టివేగదా !

క : తల్లీ ! యీచిన్నవయస్సులో నీకు యిన్నితిప్పలు వచ్చెయని.

ర ! ఈకష్టాలకు కారణం ఏమిటో తెలుసుకొని, మార్చుకోవాలే గాని ఏడ్చిన ఏమి ప్రయోజనం. నిప్పును పట్టుకోక మునుపే నిప్పుకాలుతుందని తెలుసుకొని, పట్టుకోక ఊరుకోవాలిగాని, తెలిసిపట్టుకున్నా, తెలియకపట్టుకున్నా కాలకతప్పదుగదా.

(బయట కారుహారన్ వినబడుతుంది)

(డాక్టర్ విశ్వేశ్వర్లు ప్రవేశం)

డాక్టరు : ప్రమాదం తప్పింది. ఇంకా బహు నిస్త్రాణగా వుంది. ఇంకా జాగ్రత్తగా కనిపెట్టాలి;

ల : ఇప్పుడు ఎక్కడ ఉన్నాడు ?

డాక్టరు : ఆమె యింటివద్దనే.

ల : మేము అక్కడికెందుకు. సిగ్గుచేటు. కారుమీద మీఆసు పత్రికి తీసుకువెళ్లి, కారు తిరిగి యిచ్చటికి పంపించండి.

డాక్టరు : మంచిది. (డాక్టర్ వెడతాడు)

ల : అమ్మా ! లే వెడదాం.

ర : వెళ్లిపోదాము నాన్నా. చా చా జీ సర్వజ్ఞాలు. కావున యిచ్చటనే మనకష్టాలకు మూలకారణమేమిటో తెలుసుకు వెడదాం.

ల : తెలియనిదేముంది అమ్మా ... చేసుకున్నకర్మ అనుభవిస్తున్నాము ... తప్పుతుందా.

ర : కర్మమాట వాస్తవమే. ఫలితం అనుభవించక తప్పదుకూడా అయితే అది ఏకర్మని మీవుద్దేశం.

ల : ఎందుకమ్మా ... ఈచర్చలు ... ఏజన్మలో చేసేమో.

ర : ఏజన్మలోనో గాదు. ఈజన్మలోనే. ఇప్పుడుకూడా చేస్తూనే వున్నాం. కాబట్టే అనుభవిస్తున్నాం.

క : ఇప్పుడేమి చేస్తున్నామమ్మా ?

ర : నిప్పుకాలిన తరువాతకూడా, నిప్పును పట్టుకునేవుంటే జరిగేదేమిటి ?

క : నిప్పు ఏమిటి ?

ర : మనం పెట్టుకున్న నిప్పు, మనం నోములు, వ్రతాలు దేనికై చేస్తున్నామో ఆ నిప్పును అట్టేవుంచుకొని బాధపడితే ... ఏడిస్తే ... ప్రయోజనం ఏమిటమ్మా !

క : నీవు చెప్పేది నాకు అర్థంకావటంలేదు తల్లీ.

ర : డబ్బు అమ్మా, అది చింతనివ్వడకన్న ఎక్కువ ప్రమాదమని ఎరుగవా ?

ల : అయిపోయిందేదో అయిపోయింది. రా అమ్మా వెడదాం.

ర : కాదు నాన్నా ! విద్యాబుద్ధులు లేనివారికి విశేషంగా ధనం చేతికిచ్చిన, పిచ్చివాని చేతికి రాళ్లుయిచ్చినట్లు గాదా ?

ల : కళ్లారా చూస్తూకాదని ఎవరంటారు ?

ర : అవును తల్లి. ఇప్పుడిక ఏమి ప్రయోజనం. చేతులుకాలిన తరువాత ఆకులు పట్టుకుంటే ఎంతో అంతే యిప్పుడు

ర : పిచ్చిఅయినా కుదర్చాలి. చేతులో రాళ్లయినా లేకుండా చెయ్యాలి. లేకపోతే రెండూ అయినా జరగాలి. అట్లు చెయ్యక ఏమి చెయ్యగలమని ఊరుకోవడంవల్ల మరింత ప్రమాదం కాదా ?

ల : నీవు చెప్పుచున్న ప్రతిఅక్షరం నిజంకాదని ఎవ్వరం అనలేము. ఇంత చిన్నవయస్సులోనే నీకింత జ్ఞానవుందని నాకింత వరకూ తెలియలేదు. ఇంతవరకూ మేము నీకు ద్రోహం తప్ప మరేమీ చెయ్యలేదు. ఇక ఈక్షణంనుండి ప్రతీది నీ యిష్టప్రకారమే చేస్తాము రా అమ్మా !

ర : నాన్నా ! మీరు నాకేమి ద్రోహం తలపెట్టలేదు. మంచిని కోరే మంచిజరుగుననే చేసేరు. అయితే లోపంవున్నది మీ ఉద్దేశంలోగాదు, మీ అవగాహనలో మాత్రమే.

ల : నిజమేనమ్మా. యిక అంతా నీయిష్టం ... లే ... వాడిదగ్గరకు వెళ్లి చూచివెళ్ళడమో, తీసుకువెళ్ళడమోచేద్దాం.

ర : చాచాజీ! ఏమిటి మీఉభయుల అభిప్రాయం ?
మీరుభయులు మాగ్రామం ఎప్పుడుదయచేస్తారు?

చా : చిట్టితల్లీ ! ఎక్కడ సంపాదించేవు యీజ్ఞానం అంతా.

శ్యామ్ : ఎట్టిరత్నమైనను సానబట్టనిదే ప్రకాశించదుగదా ?

ర : అవును. సానబట్టిన నిపుణులు మీరే, మీరే యీ స్థితికి తెచ్చిన గురువులు. (రమణ శ్యామ్‌ముఖంవైపు తన ముఖం తిప్పకుండా చూస్తుంది.)
చాచాజీ! జీవితంకన్న ఎక్కువ నేర్పగల పాఠశాల ఎక్కడ వుంది ?

చా : అవును. జాగ్రత్తగా అవగాహన చేసుకోగలిగినవారికి జీవితానుభవం అనేక విషయాలను బోధిస్తుంది...మీ వూరు ఎప్పుడు బిలిచితే అప్పుడే వస్తాము.

ర : అవసరమైనప్పుడు కబురు చేస్తాను. తప్పక ఉభయులూ దయచెయ్యండి, మీరు చూపిన ఆదరాభిమానాలకు నమస్కారములు. సెలవు యిప్పించండి.

(రమణ, లక్ష్మీపతి, కనకమ్మ నిష్క్రమణం)

[ తెర ]

---

"ఆర్థిక అసమానత్వం, దరిద్రం, పీడనలేని సమాజమే సర్వోదయ సమాజము. ఆర్థిక సమానతే ధర్మసమాజానికి పునాది. వ్యక్తిలేక కొందరికూటమిలేక ప్రభుత్వం చేతుల్లో ధనం కూడబెట్టుటను అరికట్టమన్న ధర్మసమాజమనే ఊహాలు వట్టి ఎండమావులు మాత్రమే కాగలవు"

---

# దత్తపుత్రశోకము

౧౩వ రంగం

[ మహాలక్ష్మమ్మ యింటి వసారా — మహాలక్ష్మమ్మ స్పృహ తప్పడం, మరల స్పృహ రావడం స్థితిలో వుంటుంది — దాసు, స్వామి. వెంకటేశ్వర్లు దగ్గర వుంటారు — కనకమ్మ, రమణ ప్రవేశం. ]

కనకమ్మ : దాసూ! స్వామీ! వెళ్ళి కోటేశ్వర్రావుగారిని జాగ్రత్తగా తీసుకురండి.

(దాసు, స్వామి వెడతారు)

రమణ : అత్తయ్యా! ... అత్తయ్యా!

మహా : ఆ ... రమణా! ... వచ్చేవా...

కనకమ్మ : అబ్బాయిని తీసుకు వస్తున్నారు...

మహా : తీసుకు వస్తున్నారా...

(రమణ అత్త బట్టలను సవరిస్తుంది)

(డ్రైవరు స్వామి, దాసు, లక్ష్మీపతి, కోటేశ్వర్రావును కుర్చీలో కూర్చోబెట్టి తీసుకువస్తారు.)

ల : (కళ్ళనీళ్ళుతరవాయిగా, విపరీతంగా బాధపడుతూ) అమ్మా... అమ్మా...

మహా : బాబూ!

దాసు : బాబు వచ్చేరమ్మా...

మహా : బాబు వచ్చేడూ... ఎంతపనచేసేవు.

ల : ఎందుకిక......

మహా : (రమణమీద చెయ్యివేసి, కళ్ళు తెరచి) నీ గొంతుకు కోసేమమ్మా! ......

ర : అత్తయ్యా! ఎందుకు అట్లా బాధపడతారు? మీరేంచేసేరు?

మహా : ఇంకెవ్వరు చెయ్యలేదమ్మా ... నేనే ... మీనాన్న ఏమీ ఎరగడు ... మా చెల్లికూడా నే చెప్పినదాన్ని బట్టే...ఆ దుర్మార్గం అంతా నేచేసిందే... ... ... క్షమించు అమ్మా!

కన : మీరు అట్లా అనకండి ... అది చిన్నపిల్ల.

మహా : ఆ చిట్టితల్లి బ్రతుకు నాశనంచేసిన దుర్మార్గురాలినినేనే... నా ఆశే మాఅమ్మ మెడలో పాశంగా తగులుకుంది.

(గోపాలం ప్రవేశిస్తాడు)

ర : అత్తయ్యా! అది అసలుకారణం...ఆశ...ధనాశ...అది మానవుని శత్రువు...అదే మనకుకూడాపరమశత్రువులయింది. అది నాకేగాదు, మనకుటుంబాలకు, మరికొందరికికూడా ప్రమాదాలు, కష్టాలు, నష్టాలు తెచ్చిపెట్టింది ... అది గుర్తిస్తే మనకష్టాలు తీరిపోతాయి.

కన : అన్నీ అయినతరువాత గుర్తించ కేమిచేస్తాము...కాగల కార్యం అయిన తరువాత పరితాపంవల్ల వచ్చే ప్రయోజనం ఏంవుంది ?

ర : తెలసిన తరువాతయినా దిద్దుకోవద్దా......

మహా : అమ్మా! నేనిక బ్రతకను ... నీ ఋణం ... తల్లీ నీ ఋణం దీరేదెట్లా ?...

ర : అత్తయ్యా! బాధపడకండి.....

కన : అబ్బాయికేమీ ఫరవాలేదు ... మీరు ధైర్యంగా వుండండి...

మహా : అబ్బాయి...అబ్బాయి గురించికాదు. మా అమ్మకు చేసిన ద్రోహం గురించి...అబ్బాయిని దత్తతచేసుకొని 250 ఎకరాలు, మూడు లక్షలు డబ్బుయిచ్చి యీ పుత్రశోకాన్ని కొనుక్కున్నాను ... చాలు ... నేను ఏడుస్తున్నది మా అమ్మకు పెట్టిన చిచ్చుగురించి......

ర : అత్తయ్యా! మీరట్లా బాధపడవద్దు, మీరు నాకేమి చిచ్చు పెట్టలేదు. భాగ్యంతో, బాగుంటాననే భ్రమతో అట్లా చేసేరు. మీరు భాగ్యం గురించి తప్పు అర్థంచేసుకున్నారే గాని, ఉద్దేశపూర్వకంగా నాకేమి ద్రోహం తలపెట్టలేదు.

మహా : అమ్మా! ... అల్లరిచిల్లరిదాననైనా యింత బాధ లేక పోయేదే...... సుగుణాలరాశీ....... నీకు ద్రోహం చేయడం ... ఎంత పాపం... క్షమించుతల్లీ ....

(కండ్ల నీరు కారుస్తూ స్పృహ తప్పిపోతుంది—కనకమ్మ విసురుతుంది. రమణ అత్త ఒళ్ళు పాముతుంది.)

దాసు : తల్లీ! నీవు మా రమణమ్మవే. ఇంత అకస్మాత్తుగా యీ జ్ఞానం ఎక్కడ సంపాదించేవమ్మా ?

గోపాలం: అకస్మాత్తుగా ఏమీ రాలేదు. ఇన్నాళ్ళు పెదవులు విప్ప కుండా జడభరతునివలె వుంది...మా చెల్లి...

(మహాలక్ష్మమ్మకు స్పృహావస్తుంది — మంచినీళ్ళు ఇమ్మంటుంది— రమణ గరిటెతో నెమ్మదిగా నీరు పోస్తుంది)

మహా : ఇక నేను బ్రతకను ... మా అమ్మ ఋణం తీర్చాలి... లేక పోతేనాకు గర్భనరకం తప్పదు.

ర : మీరు నాకేమి ఋణంలేరు...అల్లా బాధపడకండి?

మహా : ఉన్నాను...ఎన్ని జన్మలవరకూ తీర్చాలో...అంతులేని ఋణం నీకు తీర్చాలి తప్పదు...

వెంకటేశ్వర్లు బాబురాలేదూ ?

వెం : ఇక్కడే ఉన్నానమ్మా ?

మహా : బాబూ! నాపేరనున్న యావదాస్తి మారమణమ్మతల్లికీ, ఆమె యిష్టానుసారం చెల్లేటట్లు వ్రాసెయ్యండి?

ల : ఎందుకా తొందర...

మహా : తమ్ముడూ...తొందరా... అమ్మ కొంపతీసిన పాపాత్మురాలిని,ఋణం తీర్చుకోవద్దూ...నీకు తెలియదు తమ్ముడూ, ముంచుకొస్తూంది.

ర : అత్తయ్యా ! నాపై యీ భారం ఎందుకు పెడతారు ? ఈ ఆస్తి యావత్తు మీపేర ఏధర్మకార్యాలకైనా ఏలవిని యోగించకూడదు ?

మహా : అదినాదికాదు. నీది,. ఇకదానిపై నాకు ఎట్టిహక్కు పెత్తనంలేదు. దానంచేసినా, ధర్మంచేసినా, అంతానీ యిష్టం.

(వెంకటేశ్వర్లు విల్లు వ్రాసుకొస్తాడు మహాలక్ష్మమ్మ వేలుముద్ర వేస్తుంది) (తెర)

"సమాజంలోగల అసమానతలను తొలగించనిదే శాంతియుతంగా ఉండడం అసంభవం. ఇది ఏ సమాజంలో సంభవిస్తే ఆ సమాజం జడతుల్యం. సుఖ దుఃఖాలు మిథ్య అని చెప్పేవారు సమాజంలో వున్నారు. ఇలా చెప్పేవారు నిజమైన వేదాంతులు కారు. ఇలా చెప్పడం డంబానికి, అహంకారానికి పరాకాష్ట. ఆత్మవంచన, పరవంచన, వేదాంతి అనగా ప్రజల కష్టాలను నివారించగలవాడు మాత్రమే. నిజమైన వేదాంతి ఆత్మానుభవం పొంది ఎల్లప్పుడూ శ్రమిస్తూ, లోకహితం కొరకు నిస్వార్థ సేవ చేస్తారు. మాతృ వాత్సల్యంతో ప్రజల యిబ్బందులు తొలగించడానికి ప్రయత్నం చేస్తారు. అటువంటివారు కర్మయోగులు, నివృత్తి పురుషులు."

— వినోబాజీ.

# దత్తపుత్రశోకము

౧౪వ రంగం.

[రోజా మేడలో, పడక గదిలో— రాత్రి 9 గంటలకు—రోజా వ్యాఘ్రేశ్వరావు చెరొక కుర్చీపైన ఎదురెదురుగా కూర్చునివుంటారు.]

వ్యా : ఎందుకు ఆ రంగడిని అన్నిసార్లు పంపడం ?

రోజా : ఆయన మామగారు, భార్యా వచ్చి కోటేశ్వరావు గారిని ఆసుపత్రినుంచి తీసుకుపోయేరట. కొడుకు వెళ్ళిన కొద్ది సేపటికే తల్లి చనిపోయిందట... ఆ మాట విన్న దగ్గరనుంచి నాకు ఏమిటో భయంగా వుంది...

వ్యా : నీకు భయమెందుకు ?

రోజా : ఏమోనండి... ఏమి జరుగుతుందో....

వ్యా : కోటేశ్వరావు యిక రాడని బాధపడుతున్నావా ?...

రోజా : ఏమిటోనండి... నాకేమి మనస్సు కుదురు లేదు...నా భవిష్యత్ ఏమిటో అర్థం అవడంలేదు.

వ్యా : నీ భవిష్యత్ కేమి ? ఇల్లుంది, భూమివుంది; కావలసిన వస్తువులు, సామాను అన్నీ ఉన్నాయి ... నేనుండనే వున్నాను.

రోజా : అవునుగానండి... ఆ బాకీలుగొడవేమిటి ?

వ్యా : ఇప్పుడు ఆ గొడవ అవసరం ఏమొచ్చింది ?

రోజా : కాదు... అవి మీబంధువులు ఆయనకు అప్పు యిచ్చినట్లు వ్రాయించేము. వసూలైనప్పుడు వారి దయుండి యిస్తేగద్దు లేకపోతే మిగిలిలేది చేసిన అన్యాయంమాత్రమే

వ్యా : ఆ అనుమానం ఎందుకు వచ్చింది ? ఇప్పుడుకొత్త గా వచ్చిన మార్పేమిటి ?

రోజా : మీ మాటల్లోపడి, మీరు ఏదిచెప్పితే అదిచేసి, మీ ధైర్యం చూచుకొని, కోటేశ్వరావుగారిని లెక్క చెయ్యక ఈస్థితికి తెచ్చుకున్నాను.

వ్యా : ఇంకా నీకు కోటేశ్వరావుమీదనే మోజు వుందన్న మాట. ఎన్ని చెప్పినా నాపై విశ్వాసంలేదా?

రోజా : విశ్వాసం ఉండబట్టే మీరు చెప్పినట్లల్లా చేసేను.

వ్యా : నీకు వచ్చిన లోటు ఏమీలేదు. కాని రేపు అర్జంటుగా ఒక బాపతు మూడు వేలు యివ్వాలి. ఇవ్వవలసినవాళ్లు ఇదిగో, అదిగో అని యివ్వలేదు. రెండుమూడు రోజుల్లో తప్పక వసూలవుతాయి. నాలుగైదు రోజులు తప్పితే వారం దాటకుండా తెచ్చియిస్తాను. మార్వాడి దగ్గర తాకట్టుపెట్టి డబ్బు తెచ్చుకోడానికి నీవస్తువులు ఒక్కసారి యిద్దూ.

రోజా : చాలు. ఇంతవరకూ చేసినదానికి వడ్డీ కాబోలు......

వ్యా : అయితే యివ్వదలచుకోలేదా ?

రోజా : ఊరుకోండి. మీ మాటల్ని ఏమని అర్థంచేసుకోవాలి? కాస్త కాగితంముక్కయినా లేకుండా, మిమ్మల్ని నమ్మి నలభై వేలు మీ బంధువుల పేర పెట్టేము. దానికే దారి తెన్నూ లేకుండాచేసి, ఇప్పుడు మళ్లా నగలు అడుగుతున్నారా...

వ్యా : వస్తువులివ్వడం యిష్టంలేక యీ పురాణమంతా విప్పుతున్నావా ఏమిటి ?

కోజా : అదేమిటి ? వారిచేత కాస్త కాగితం ముక్క-యినా వ్రాయించి యిస్తానని మీ నోటమ్మట రాదు.

వ్యా : ఇప్పుడు వ్రాయమంటే ఏమి బాగుంటుంది ?

కోజా : లేకపోతే ఆ నోట్లు అన్నీ నాకు యిచ్చివెయ్యకూడదూ.

వ్యా : ఎందుకా తొందర. నిన్ను నేను మోసంచేస్తానని భయపడుతున్నావా ?

కోజా : ఆ భయంగానే వుందండి. పోనీ మీరైనా వ్రాసియివ్వకూడదూ ?

వ్యా : అదెట్లా వీలవుతుంది ?

కోజా : పోనీ ఒక మామూలు వుత్తరం అయినా వ్రాసి యివ్వండి.

వ్యా : అలా వ్రాయకూడదు.

కోజా : మోసం. ఆ కోటేశ్వర్రావుగారిని అన్యాయం చేసింది మీ ఒక్క-రికోసమేనా ?

వ్యా : ఇప్పుడు నీకేమి అన్యాయం జరిగింది. ఈ అడావిడి తగ్గిన తరువాత, ఆ బాకీ వసూలైనతరువాత వాళ్ళని అడిగితే బాగుంటుందిగాని అలా తొందరపడతావేమిటి ? మనం వాళ్ళు కావాలంటే వాళ్ళపేర వ్రాసేమేమిటి?

కోజా : కోటేశ్వర్రావుగారిని, నన్నూ మాయచేసి మీరు తిని వెయ్యడానికేనా యీ ద్రోహం నాచేత చేయించింది ?

సరే... మీ బుద్ధి ఏమిటో అర్థమయింది. నాకు దక్క-
నీయకుండా మీ రేపాటి వసూలు చేస్తారో నేనూ చూస్తాను.

వ్యా : ఏంచేస్తావేమిటి ?

రోజా : చెయ్యవలసింది...చెయ్యగలిగింది... చేస్తాను వెళ్లండి.

వ్యా : అబ్బా! ఊ... చెయ్యి. అయితే అదేమిటో నేను
చూస్తాను. (తెర)

---

"నిరంతర త్యాగవిరతిలోనే జీవిత సత్యస్థితి యిమిడివుంది.
త్యాగశీలం పరిపక్వమైనప్పుడే జీవితం పరిపూర్ణమౌతుంది."
—రవీంద్రనాథ్ టాగూర్.

'మన కోరికలచే మనం బందీల మవుతాము. నిజమైన సుఖం
కోరికలను జయించినప్పుడు గాని లభించదు—'

---

# దత్తపుత్ర శోకము

## ౧౫వ రంగం.

[మహాలక్ష్మమ్మగారి యింటి హాలులో ఉదయం 9 గంటలు— లక్ష్మీపతి, రమణ, వెంకటేశ్వర్లు, స్వామి, దాసు ఉంటారు—ప్రక్కగదిలో గుమ్మం దగ్గరగా కుర్చీలో కోటేశ్వర్రావు కూర్చునివుంటాడు—]

రమణ : వెంకటేశ్వర్లుగారూ! రాజవాడలో తీర్చవలసిన బాకీల మొత్తం తేల్చుకొచ్చారా ?

వెంక : రు 47,687-3-3. కాని ఆబాకీలు బహుశా తీర్చనక్కరలేదు.

ల : ఎందుచేత ?

వెంక : రోజా, వ్యాఘ్రేశ్వర్రావులు ఆ డబ్బుగురించి తగువులాడుకున్నారట. దానిపై రోజా మా తమ్ముడికి కబురు చేసి, అసలు రహస్యం బయటపెట్టి, మీటింగుల్లో చెప్పమని, పత్రికల్లో వేయించమని వ్రాతమూలకంగా స్టేట్‌మెంటు యిచ్చిందట. దాంతో వ్యాఘ్రేశ్వర్రావుగారు ఏవూరు వెడితే ఆవూళ్లో యీ విషయమయ్యే ప్రశ్నిస్తున్నారట. దానికి ఆయన 'తనకుగాని, తన బంధువులకుగాని కోటేశ్వర్రావుగారు ఏవిధమైన బాకీలు లేవ'ని సమాధానం చెబుతున్నాడట.

ల : సరే... ఒకవేళ యివ్వవలసివచ్చినా యింట్లో డబ్బువుంది. (చాచాజీ, శ్యామసుందర్, మరి కొందరు సర్వోదయ

కార్యకర్తలను వెంటబెట్టుకొని గోపాలం ప్రవేశం—వీరి తోపాటు పలువురు గ్రామస్థులు కూడా అక్కడికి వస్తారు.)

(రమణ, లక్ష్మీపతి వచ్చినవారికి నమస్కరిస్తారు.)

ర : చాచాజీ! కడనుంచి కాలినడకనే వచ్చేరా ?

చాచాజీ : అవునమ్మా...

ర : మీదగ్గరనుంచి మేము వచ్చినతరువాత జరిగిన సంఘటనలన్నీ విన్నారా ?

చా : గోపాలంగారు అన్నీ చెప్పేరు.

ర : అయితే... ఏమిటి సెలవు ?

చా : నాన్నగారు, కోటేశ్వరావుగారు, మిగిలినవారు వారి వారి అభిప్రాయాలు చెప్పనియ్యి అమ్మా:

ల : అంతా మా అమ్మ యిష్టమే.

కన : వయస్సుకు పెద్దవాళ్ళమేగాని, దానికంటె మాకు తెలిసిందేముంది ?

స్వామి : కోటేశ్వరావుగారి అభిప్రాయమేమిటో ?

(కోటేశ్వరావు నెమ్మదిగా హాలులోకి వస్తాడు)

కోటే : రమణ నా మేనమామ కూతురు మాత్రమే. పుస్తి కట్టేనేగాని, ఎన్నడూ ఆమెను భార్యగా చూడలేదు.. .........ఇక ఆస్తి. ఆస్తివున్నా, అప్పువున్నా, నేను

ఇప్పుడు చెయ్యగలిగిందేముంది? మీకందరికీ ఏది మంచి దని తోస్తే అదే చెయ్యండి.

గోపాలం : చెల్లీ! నీవు చెప్పేదానికి ఎవరు అడ్డుచెప్పగలరు. జ్ఞానమే నీకు సర్వాధికారాన్ని ప్రసాదించింది.

చాచాజీ : విశేషధనాన్ని, వ్యక్తి కూడబెట్టడం, కలిగియుండడం, సమాజానికే గాకుండా, కూడబెట్టినవారికి కూడ చేటు తెస్తుందని ఈ గాథ తేటతెల్లన చేస్తూంది. ఇట్టి పరిస్థితు లలో చాచా చూపుచున్న మార్గమే మీ అందరి భవి ష్యత్‌కు మంచిమార్గము కాగలదు.

శ్యామ్ : ప్రపంచములో స్థిరమైన శాంతి, నిజమైన ప్రజాస్వామ్యం ఏర్పడాలంటే విజ్ఞాన వికాశాలతో మానవకోటి సుఖం చాలంటే, వ్యక్తులు, ప్రభుత్వాలు స్వార్థాన్ని వదలాలి. త్యాగాన్ని అలవర్చుకోవాలి. త్యాగం ప్రస్తుత యుగ ధర్మం.

ర : ఉభయ కుటుంబాలు; కుటుంబ పోషణకు అత్యవసరమైన స్వల్ప ఆస్తి ఉంచుకొని, అంతంత ఆస్తే కారు ప్రమాద ములో మరణించిన పార్వతి కుటుంబానికి చిరకాలంనుండి అతి శ్రద్ధాభక్తులతో ఈ యింటి సేవ చేస్తున్న దానుకు యిచ్చి మిగిలిన యావత్తు స్థిరచరఆస్తులు ఈ గ్రామంలో పార్వతి పేర మాతా శిశుపోషణ కేంద్రము మహాల క్ష్మమ్మగారి పేరిట వృద్ధులకు, వికలాంగులకు సహాయ

కేంద్రము, మా నాన్న పేర ఉన్నత విద్యాపాఠశాల, మా అమ్మపేర పేద విద్యార్థులకు భోజన వసతి గృహము ఏర్పరుచుటకు, రొఖ్ఖఆస్తి సర్వోదయ సాహిత్యం ప్రచు రించుటకు, ఆ ఉద్యమం ప్రచారం చేయుటకు వినియో గించుట గురించి ఏమంటారు ?

స్వామి : కోటేశ్వర్రావుగారి ఆరోగ్యము ఏమీ బాగులేదుగదా. వారి ఆ స్త్రీమట్టుకు అల్లా పంచివేయడం మంచిదికాదా ?

దాసు : పాపం! ఎంతదయో! ఏమీ ఎరగని బాబుగారికి పాడు బుద్ధులన్నీ మప్పింది నువ్వేగదా ?

గోపాలం : ఎన్నీ చెయ్యకపోతే పాలేరుగా ప్రవేశించినవాడికి పది ఏళ్ళలో పదిహేను ఎకరాలు ఒకటోరకమైన భూమి పది, పదిహేను వేలు వడ్డీ వ్యాపారం ఎక్కడనుంచి వస్తాయి ?

స్వామి : ఎందుకొచ్చినమాటలు...

దాసు : కోటేశ్వర్రావుగారిని, వారికంటె నువ్వు ఎక్కువ బాగు చేస్తావా ?

గోపాలం : చేసేడుగదూ! ఆయన చలవే యిదంతా...

స్వామి : ఏదో మనసుపట్టలేక చెప్పేనుగాని నాకెందుకు ?

కన : అమ్మా! దానంకంటె మించిన ధర్మంలేదు. అల్లాగేచెయ్యి.

గోపాలం : కన్నవాళ్ళకే గాకుండా గ్రామానికంతకు కీర్తి తెస్తు న్నావు చెల్లీ !

దాసు : మా అమ్మలో మొదటినుంచి యీ ఉదారభావాలే ఉన్నాయి. ఆనాడు మర్రిగింజయితే యీనాడు మహా వృక్షమయింది. అమ్మా! చేసిన మంచిచెడ్డలు మిగిలిపో తాయిగాని, చచ్చిన తరువాత ఈ డబ్బు కూడారాదు. ఎంతో తాపత్రయంపడి మహాలక్ష్మమ్మగారు యిదంతా సంపాదించింది. కూడా ఏమి పట్టుకువెళ్ళగలిగింది ? ఇక నాకు ఆ స్తివద్దు తల్లీ! ఈ జీవి వున్నంతకాలం మీతోటే వుండనియ్యండి.

శ్యామ్ : దానం యివ్వదలచేరు బాగానేవుంది. అయితే దీనివల్ల యిన్నాళ్లనుంచి మీరు మోస్తున్న భారాన్ని దింపివేసు కోవడమే అవుతుందిగాని, అసలు సమస్యా పరిష్కారం కాదు. భూమి, ఇతర ఉత్పత్తిపరికరాలపై వ్యక్తి యాజ మాన్యం పోనిదే బాబా కోరే సామ్యయోగ సమాజం ఏర్పడదు. అందుకై శక్తివంచన లేకుండా కృషిచెయ్యాలి.

(రమణవైపు చూస్తూ)

అయితే అన్నీ చెప్పేరు... మీ భవిష్యత్ మాటేమిటి?

ర : (వెంటనే మీతోనే___

శ్యామ్ : సర్వోదయ ఉద్యమంలో పనిచేయుటకు సంసిద్ధమేనా ? జీవిత శేషాన్ని ఆ మహాకార్యానికి అంకితం చేయుటకన్న వేరేమిటి ? అదేనా హృదయపూర్వక ఏకైక వాంఛ.

(జీవన్ దానీ రమణమ్మగారు వర్ధిల్లాలి. అనే నినాదాలు అక్కడవున్న సర్వోదయ కార్యకర్తలిస్తారు.)

చాచాజీ : (ఆనంద పరవశుడై) అమ్మా! రమణమ్మతల్లీ! లోకానికి మార్గదర్శివయ్యావు. సర్వోదయ కుటుంబంలో చేరబూనిన నీకు హృదయపూర్వక స్వాగతం.
భూదానోద్యమం విజయవంతం కావడానికి స్త్రీలు ముందుకు వచ్చి, అందు పాల్గొనడం అత్యావసరం. ఈ ఉద్యమానికి అనివార్యమైన వారి శక్తిని సోదరీమణులచే గుర్తింపచెయ్యాలి. అందుకై వారిని సంఘటితపర్చాలి. చైతన్యవంతుల్ని చెయ్యాలి. ఈ బాధ్యతను నెరవేర్చుటకు నీవు అన్నివిధాల అర్హురాలవు.

శ్యామ్ : "స్త్రీ త్యాగస్వరూపిణి, ఆమె సదుద్దేశాలతో పనిచేసినప్పుడు పర్వతాలను సహితం కదలించగలుగుతుంది" అన్నారు గాంధీజీ.

ర : దస్తావేజులు వ్రాయుటకు స్టాంపులు తెప్పించు నాన్నా!

చా : అక్కర్లేదు. భూదానోద్యమ దానపత్రాలపై వ్రాసిన స్టాంపు, రిజిస్ట్రేషన్ వగైరాలు అక్కర్లేదు. శాసనరీత్యా యివికూడా రిజిస్ట్రేషన్ చేసిన దస్తావేజులతో సమానమే.

ర : అయితే అట్లా వ్రాయించండి.
(సర్వోదయ కార్యకర్తలు దానపత్రాలు తయారుచేసి సంతకాలు పెట్టిస్తారు.)

గోపాలం అన్నయ్యా! దాసూ! ఈ గ్రామంలో ఏర్పాటు చేయబోయే ధర్మసంస్థల నిర్వహణలో మీరుకూడా తోడ్పడాలి.

దాసు ; గోపాలం : (సంతోషంతో) తప్పక అట్లేచేస్తామమ్మా.

చాచాజీ : "ద్వేషం ద్వేషాన్ని వృద్ధిచేస్తుందేగాని సమాధాన పర్చలేదు. కోపం కోపాన్ని రగుల్కొల్పుతుందేగాని చల్లార్చలేదు. అసత్యాన్ని అసత్యమాడుటద్వారా జయించుట అసాధ్యం. కావున ద్వేషాన్ని ప్రేమతో సమాధానపర్చాలి. క్రోధాన్ని శాంతిభావంతో ప్రతిఘటించాలి. సత్యాన్ని సత్యంతోనే సవాల్ చెయ్యాలి" అని ఏనాడో బుద్ధ మహాశయుడు సెలవిచ్చేరు. చిరంజీవి రమణగారే దానికి ప్రత్యక్ష తార్కాణం.

దానిని గుర్తించి పార్టీ మత కుల, ప్రాంతీయ విభేదాలను పాటించకుండా విశ్వమానవ సౌభ్రాతృత్వంతో లోక కళ్యాణానికై సజ్జనులెల్లరు ఏకమై కృషిచేసిన సామ్యయోగ సమాజం సిద్ధించుట తథ్యం, మరువకండి. మనం సాధించవలసిన లక్ష్యం "సర్వే జనాః సుఖినోభవంతు."

[తెర]

---

పాపులర్ పవర్ ప్రింటింగ్ ప్రెస్, కాకినాడ.

"భారతదేశం తన ప్రాచీన సత్సాంప్రదాయాలను స్వయంగా పాటించటంద్వారా తాను సర్వతోముఖాభివృద్ధి చెందుతూ, గాకుండ మానవ కోటికి మార్గదర్శికాగాలదు. అట్లాగని విదేశాలకు సంబంధించిన ప్రతి విషయాన్ని త్రోసిపుచ్చమనిగాదు. ఆధారణ శుద్ధ పొరబాటు. అది ఆచరణలో అసాధ్యంకూడా. వివేకవంతులు మానవాభ్యుదయానికి తోడ్పడే ప్రతి క్రొత్త వెలుగును కాదనరు. భారతదేశంలో గొప్పజ్ఞాననిధివుంది. బుద్ధిపూర్వకంగా ఉత్తమ ఆదర్శాల్ని అమలుపర్చగల శక్తి సామర్థ్యాలు మన కున్నాయి. అందుచే మనదేశం పూనుకుంటే నేడు మానవకోటి ఎదుర్కొనుచున్న పెక్కు క్లిష్టసమస్యలకు తన అపూర్వ జ్ఞానసంపద ద్వారా పరిష్కారమార్గం చూపగలదు. నేడుతనపై వచ్చిపడే సదవకాశాన్ని వినియోగించుకునే స్థితికి అభివృద్ధి అవుతుందా? లేదా? అనే దానిపైనే మన దేశంయొక్క భావి ఆధారపడి ఉంటుంది."

(అరవిందఘోష్.)